# హంసతత్త్వ కందార్ధ దరువులు

(తారకసాంఖ్యామనస్క విషయము)

43/1917 PNO35 SINO3



ఇది

బ్రహ్మశ్రీ మదుపు సుబ్బయ్యాచార్య దేశికేంద్రులవారి
ప్రియశిష్యులునై ప్రకాశించు

బ్రహ్మశ్రీ వీరమహేశ్వరరిపదెం నాగలింగయ్య
జంగమదేవరవారిచే వ్రాయబడిన
హంశప్రశ్నోత్తరములు తత్త్వాంతానుసారముగ

బ్రహ్మశ్రీ పానుగంటి కోటీశ్వర జంగమదేవరచే
రచియింపబడినది

---

చంద్రికాముద్రాక్షరశాలయందు ముద్రింపబడియె

గ్రంథములు వలయువారు:—
గుంటూరు పెద్దమసీదువద్దనున్న మదుపు
సుబ్బయ్యాచార్యులవారికి వ్రాయవలయును

SINO709/Auno 6850.

కాపీరైటు వెల 0—8—0

1917.

ఓం.

సద్గురు పరబ్రహ్మణేనమః.

హంసతత్త్వకందార్థదరువులు.

# తారక సాంఖ్యామనస్క విషయములు

ఏతద్గ్రంథము

శ్రీమద్వీరాగమోక్త విరాడ్విశ్వబ్రహ్మ పఞ్చముఖోద్భవవిశ్వ
బ్రాహ్మణకులసంజనిత సుపర్ణసగోత్ర ప్రత్నోద్భవ విశ్వజ్ఞసూ
త్ర ప్రణవశాఖాసముజనిత శ్రీమన్మహాపురాణపయఃపా
రావార రాకాసుధాకర బ్రహ్మశ్రీ సుబ్బయ్యాచార్యదే
శికేంద్రుల వారి ప్రియశిష్యులనై ప్రకాశించు

శ్రీమత్పరమపావన పరశివ పఞ్చముఖోద్భవానాదిజంగమదేవకు
లసంజాత భృంగీశ్వరసగోత్ర దారుకసూత్ర మహాప్రణవశా
ఖాసముదిత శ్రీమత్పశుపతినామోదయ బాలశేశాం
క షట్టుల బ్రహ్మశ్రీ సిరిమాహేశ్వర నాగలింగ
య్య జంగమదేవర వారిచే వ్రాయబడిన హంస
ప్రశ్నోత్తరముల కత్యంతానుసారముగను
శ్రీమద్వీరాగమోక్త పరమపావన పరశివ పఞ్చముఖోద్భవా
నాదిజంగమకులదేవసంజాత నందీశ్వరసగోత్ర రేణుకసూ
త్ర నవప్రణవశాఖాసముజనిత శ్రీమత్పానుగంటివంశ సం
భూత షట్టుల బ్రహ్మశ్రీ సిరిమాహేశ్వర కోటీశ్వర
జంగమదేవరచే రచియింపబడినది.

ఇయ్యది పండితులచే పరిష్కరింపబడి
చంద్రికా ముద్రాక్షరశాలయందు ముద్రింపబడియె.
గుంటూరు.



ఓం.

సద్గురుపరబ్రహ్మణేనమః.

# పీఠిక.

శ్లో॥ గురుబ్రహ్మ గురుర్విష్ణుర్గురుదేవో మహేశ్వరః।
గురుసాక్షాత్పరంబ్రహ్మ తస్మైశ్రీగురవేనమః॥

శ్రీమన్మహీమండలంబునంగల సద్గురుపుత్రవర్యులారా! కొంద‌రు నవీనవేదాన్తులు సాంఖ్యవిచారణము యోగాభ్యాస మనవసరమ‌నియు బలుకుచున్నారది యోగ్యమైనదిగాదెట్లన నిగమాగమస్మృతి‌సూత్రసంహితా పురాణధర్మశాస్త్రభాష్య గ్రంధాదులయందంతట‌ వేదవ్యాసాది ఋషులచేతను, నందీశ్వర రేణుకాది ప్రమధులచేతను, వేదాన్తము ఉపనిషద్భాగమనియు, మోక్షసాధనమనియు, బలుకబడి‌యున్నయది। అట్టివేదాన్తము। గీ॥ తారకంబుమనశ్శుద్ధికారకంబు।సాంఖ్యమాత్మరూపవిచారకంబు। అనుభవజ్ఞానమమనస్కమట్లుగాన। నా‌ద్యమెరిగింపు మొదలనీవధరింపు॥ ఇత్యాది మహద్గ్రంథములయొక్క ప్రమాణంబులచేత తారకము, సాంఖ్యము, అమనస్కము, అనిత్రివి‌ధముగా విభాగింపబడియున్నది. మఱియు॥ శృతిః॥ కాశ్యాంతుబ్రహ్మ‌నాళేస్మిన్। మృతోమత్తారమాప్నుయాత్। పునరావృత్తిరహితాంము‌క్తింప్రాప్నోతిమానవః। యత్రకుత్రాపికాశ్యాంతు మరణేసమహే‌శ్వరః। జంతోర్దక్షిణకర్ణేతు మత్తారం సముపాదిశేత్। నిర్ధూ‌తాశేషపాపౌఘో మత్సారూప్యం భజత్యయం॥ ఇతిముక్తికో‌పనిషత్॥ తా॥ ఓవాయునందనా, కాశీక్షేత్రంబునందు బ్ర

హ్మనాళప్రదేశంబున మృతిజెందినవాడు శ్రీరామయనెడి మత్సం
బంధంబగుతారకమన్త్రింబు నుపదేశమునుబొందినవాడగుచు, పునరా
వృత్తిరహిత మోక్షంబును జెందగలడు. ఇత్యాదిప్రమాణంబులచే
తారకమన్త్రోపదేశము మోక్షప్రదమనియు పునరావృత్తిరహితమార్గ
మునకు ప్రథమ సాధనంబై యున్నయది. శృతిః॥ అధ్యారోపాపవా
దతః। స్వరూపంనిశ్చయీకర్తుం శక్యతే తస్మాత్సదావిచారయేజ్జగజ్జీవప
రమాత్మనః। ఇతిపైంగళోపనిషత్॥ వేదాన్తవిచారమందు అధ్యారోప
యుక్తి అపవాదయుక్తియని ద్వివిధయుక్తులుగలవు. అధ్యారోపము
బంధప్రాప్తిని అపవాదము మోక్షప్రాప్తినిగలుగ జేయును. ఇది విచా
రించుటవల్లనే స్వస్వరూపంబెరింగి ముక్తుడగుచున్నాడు. గాన జగత్తు,
జీవుడు, బ్రహ్మము, నీని లక్షణముల శోధించు నీరెండు యుక్తులున్నూ
యెల్లపుడు విచారించుచుండవలెను. ఇత్యాదిప్రమాణంబులచే జగజ్జీవ
ప్రత్యక్పరమాత్మలయొక్క విచారణ ద్వితీయ సాధనమని దెలియబడు
చున్నది. శృతిః॥ నానాశాస్త్రప్రవేశోకే నానాదేవంచపూజనం ఆత్మ
జ్ఞానం వినాపార్థ। సర్వకర్మనిరర్థకం ఆచారక్రియాతే కోటిదానంచగిరి
కాంచనం।ఆత్మతత్వం వినానాస్తి ముక్తిర్నాస్తిగురుర్వినా కోటియజ్ఞం
కృతంయేన కోటిగోహయదానకం గజదాన సహస్రంచ ముక్తిఃజ్ఞానం
వినానచ॥ ఇతిగర్భగీతాః। తా॥ ఓఅంజనీ నందనా సకలశాస్త్రంబుల
జదివి పండితుడని పేరొందినప్పటికిన్ని, బ్రహ్మాది సకలదేవతలపూజించి
నప్పటికి ఆత్మజ్ఞానములేని యెడల, అనగా తన్నుగా దెలిసికొనని
యెడల పైనజెప్పిన వన్నియు, నిష్ప్రయోజనములగు. తనుందా గురు
ముఖముగా దెలియని యెడల అనగా జీవాత్మ యిట్టిదని, ప్రత్యగాత్మ
యిట్టిదని, పరమాత్మ యిట్టిదని, దెలిసికొనని యెడల నిష్ప్రయోజనం
బులనిభావము. కోటియజ్ఞములు చేసినను గురుకటాక్షము లేక ఆత్మ
జ్ఞానము లభింపదు. ఆత్మజ్ఞానము లేక ముక్తి లభించదు. శరీరమిట్టి
దని శరీరలక్షణములు విచారించి దెలియని యెడల శరీరమం

దాన్ని ప్రజ్ఞానమిట్టిదని యనగా దన స్వరూప మిట్టిదని దెలియ నేరదు. స్వరూపమిట్టిదని దెలియనిమొదల శుద్ధ నిర్గుణ పరబ్రహ్మ మిట్టిదని దెలియబడదు గాన ప్రకృతిద్వయమనెడి దేహాత్మలను విచారించి పిదప సదాసమాధియందు స్వస్వరూపానుసంధానంబునఁ మునుగుచు కుమ్మరిపురుగు విధంబునఁ ప్రపంచంబుననుండియు తద్వికారకంబుల నంటక రాజయోగీశ్వరుండై ప్రవర్తింపవలయు. కొందరు నవీనవేదాంతులు యోగాభ్యాస మనవసరమని బలుకుచున్నా రది శాస్త్రానుభవములకు సమ్మతముగాదు. గృహస్థులకైనను రాజ యోగాభ్యాసము లేనిది చిత్తశుద్ధిగానేరదు. బూటకములైన మాట లెన్ని జెప్పినను రాజయోగాభ్యాసము జేయక స్వరూపానుసంధానముగా నేరదు. సీ॥ గాలంబు లేనిచో, జాలవాగురికచేత, పాశజాలముల్ పట్టుబడునె। సరియుఁ లేనిచో శకునాంతకునిచేత దొక్కుపుపక్షులు చిక్కువడునె। యోదంబు లేనిచో, నాగిమావటీనుచే గజరాజములు నరికట్టబడునె। తగుకోల లేనిచో, మృగయావినోదిచే ఘోరమృగంబులు గూల్పబడునె। తే॥ రాజితానందతారక రాజయోగ। సాధనసమాధి లేనిచో, పరమసుఖ। తర్క వేదాంతవాదతత్పరులచేత నింద్రియమనంబులు నిగ్రహింపబడునె॥ (అనిసీతారామాంజనేయము) క॥ యోగాభ్యాసమొనర్పక రాగంబున శివునిమదిన దయముసదలచి చి। ద్యోగానందము జెందక, యోగులమనుకొన్న ముక్తి యొసగునె బసవా॥ క॥ ఇచ్ఛగపశ్చిమనాళము జొచ్చినమది వేగమనగి చోద్యంబులరిఁ ఇచ్చలబాసియు సర్వము నచ్చెత్తీసనీతిబోధయులనకుబసవా॥ అనియు॥ బయలందు తనువుబ్రగాంచియు। బయలును తనువందుగాంచి। బయలులో బయలై బయలెఱుగకుంటునాతడె। బయలంచును శ్రుతులుబల్కు భవహరబసవా॥ అనిబసవశతకము। గీ॥ చేసెశివయోగములనెల్ల శివుని గనక పరమయోగంబులఁజేయ బ్రాలుమాలి। శ్రేష్ఠశివయోగిననుకొన్న సిగ్గుగాదె, పరమబాహ్యాంగ ప్రభులింగ భవవిభంగ॥ అనిప్రభులింగశతకము॥ క॥

కన్నుల దృష్టియు జెదరిన, మన్నుగ చిత్తంబు జెదరు, పవనము జెదరున్
తిన్నగ లక్ష్యము జెదరును అన్నా గురుదీక్ష మొదలు నాశ చెదరున్॥ అనిపరబ్రహ్మానందబోధము॥ గీ॥ కరతలంబున నున్న ఘనయిష్టలింగంబు కంటిచేత దానినంట జూచి కనులుమూసి తెన్నగను జె లింగైక్యంబు పాపభయవిభంగ భావలింగ॥ అని భావలింగశతకము॥ నాదబిందుకళల, నాణెమెరుగని యోగి యింద్రియములును మనస్సునిట్టులట్టు పరువు లిడగ వానిపట్టజాలకనుండు నిట్టివాడు పరుని నెట్టుగాంచు॥ అనిసీతారామాంజనేయము. ఇత్యాది ప్రమాణంబుల యోగాభ్యాసము లేక చిత్త చాంచల్యమణుగ నేరదు చిత్త చాంచల్యముడుగక స్వస్వరూపాను సంధానముగా నేరదు. స్వస్వరూపానుసంధానము లేక పరిపూర్ణత్వసిద్ధిగానేరదు .గాన గృహస్థులైనను రాజయోగాభ్యాసము జేయవలయు లేనియెడల నిరర్థకంబు। యోగాభ్యాసము జేసినను దేహాత్మలిట్టివని దెలియక మోక్షము లేదు॥ శృతి॥ సాంఖ్యం దేహవిచారణమ్" ఇతి బ్రహ్మయామిళేతా॥ దేహమిట్టిదనియు, దేహియిట్టివాడనియు అనగా వస్తువిట్టిదనియు దెలియుటయే సాంఖ్యవిచారణమనబడు॥ అనగా తనువిట్టిదని ఆతనువు యందుండే ప్రజ్ఞానము అన దెలివిట్టిదని యనగా నెరుక ఇట్టిదని దెలియనియెడల మరియు నా ప్రజ్ఞానము, శరీరంబున నిస్థానమందిట్లున్న దీని గురుముఖముగా నెరుగక ననగా స్వస్వరూపజ్ఞానము లేనియెడల పరిపూర్ణత్వసిద్ధిగా నేరదు ఉట్టికెక్కలేనమ్మ స్వర్గానికెక్కెక్కినడే లోకోక్తివలెనె యెరుకరూపమిట్టిదని దెలియక పరిపూర్ణత్వ సిద్ధిగా నేరదు గాన మొదట సద్గురుమూర్తిచే తాఃక సాంఖ్యవిచారణము చక్కగా దెలసి పిదప రాజయోగాభ్యాస మొనర్చి సాంఖ్యవిచారణము పూర్తియైనపిదప పరిపూర్ణము యొక్క మంత్రమంత్రార్థమంత్రరహస్య మంత్రసారముల సద్గురుకరుణచే దెలసి॥ అప్పుడు॥ ఎచట నేవంక జూచిన నెలమితోడ తొడరు చిన్మయలింగమై దోచవలదె యదిగదా యోగసిద్ధికి నాలయంబు నవ్యతరభోగి శ్రీసదానంద యోగి॥ అనిసదానంద యోగి

శతకము॥ ఘనతర్క తారక సాంఖ్యయోగములచే కష్టింపగానేలనె
మ్మనముఁ బట్టగనేలనింద్రియములఁ మర్దింపగానేల చక్కనగా
ముందటగానుపించు ఘటమున్నన్నట్లు బ్రహ్మంబుదా దనుదాగాంచిన
యప్పుడే నిఖిలముఁ దానై జెలంగున్ తగఁ॥ అనిసీతారామాంజనేయ
ము॥ తెలివే పరిపూర్ణంబని దెలియనివారందురిట్లు దెలసినమీదఁ।
దెలివియుగలుగదు నెవరికి దెలియక నుండుటయెముక్తి తేటగబసవా॥
అనిబసవశతకము॥ ఇత్యాదిప్రమాణంబులచే తారకసాంఖ్యయోగం
బులఁ వదలి యెరుకమరుపులులేని పూర్ణబోధనుబొంది సంపూర్ణుడు
దానైన జన్మరాహిత్యంబగు. అట్టిపరిపూర్ణస్వరూపుడు దానగుటకు
ముందు సద్గురుని శేవించి సాంఖ్యవిచారణమును జేయవలయును నన
గా[illegible]పీలికాది బ్రహ్మపర్యంతములైనట్టి దేహములిట్టివనియు తద్దేహము
లయందుండు చైతన్యరూపంబైన పరబ్రహ్మమిట్టిదనియు దెలియవ
లయును శృతిః॥ చైతన్యంవినాకించిన్నాస్తీతిసాక్షాత్కారానుభవజ్ఞా
నం॥ నానాత్మభేదకల్పితం జ్ఞానమజ్ఞానం॥ శరీరత్రయములకువేరై సాక్షి
యైయుండెడి ఆత్మయేదాననియు తనవలనదెలియబడిన కాయేంద్రియా
ద్యనేకవిధ నామరూపాత్మక ప్రపంచంబు దృశ్యమనియు జడమనియు
సమస్త ప్రపంచము నెరుగుచుండెడి జ్ఞానానందమయుండగుదాను। కం॥
లింగము దృక్కప్రకృతికి లింగంబేదృశ్యమగును లెస్సగబయలఁ
అంగములోపలలింగము లింగములోబయలువెలయు లెస్సగబసవా॥
అనిబసవశతకము ఇత్యాది శివయోగీశ్వరోక్తులచే దానేదృక్కనియును
మరియు సముద్రోదకమునందు నుద్భవించిన తరంగములుతత్సముద్ర
జలంబునకంటె వేరుగానట్లు ప్రపంచంబు సర్వంబును తనయందు
కల్పితంబగుటవలన దనకంటెవేరుగాలేదనియు నైనను కల్పితంబగుట
వలన రజ్జుసర్పంబురీతిని కల, కలలోగనుపడు ప్రపంచమురీతిని యసత్య
మనియు నాత్మస్వరూపుడైనదాను సత్యజ్ఞానానంద బ్రహ్మంబనియెరిం
గి సకలసంశయంబులఁ విడనాడి నిష్కామియై ఆత్మధ్యాన నిరతుండై

వికల్పశూన్యుండై యేకోటికలులేక సకలదృశ్యముల మరచి కేవలసా
క్షిమాత్రుండై ఆనందించుటయే జ్ఞానమనబడు. అట్లాత్మస్వరూపుడగు
దానే పరబ్రహ్మమనియెరుగక తనువేదానని దలంచి, దేహాభిమానము
గలవాడై సకలచరాచర ప్రపంచము దనకంటె వేరుగాభావించి
కామక్రోధాది దుర్గుణములుగలవాడై కలిమివాసన కులమువాసన బ
లు విద్యావాసనచే విర్రవీగుచు జననమరణంబులం బొందుచుందురు॥
మరియు లోకంబున కొందరు వేదాన్తులు, మేమనుభవపరులమని,
దినరానిపదార్థంబులదినుచు, కల్లు గంజాయి సారాయి యశుద్ధము
మాంసము సల్పాచమానము, నింద్రియము మొదలగునవి దినుచు జాతి
నీతులుదలపోయక ఇదితల్లి, యిదిచెల్లెలు, ఇదిభార్య, ఇదిపుణ్యము
ఇదిపాపమనియెన్నక ఇతడు గురు వితడు శిష్యుడని దలచక దుష్కా
ర్యంబులంజేయుచు లోకులకు జ్ఞానులమనిజెప్పుచు దొంగ వేదాన్తులై
స్వధర్మంబుల విడచి శిష్యులకులము జెరచి దాముకులము జెడుచున్నారు
శిష్యుల సుగుణంబుల దొలగించి జారత్వము చోరత్వము మొదలు
గునవినేర్పుచున్నారు॥ మరియు॥ అహింసాపరమోధర్మః॥గీ॥ హింసజే
యకుండుటె ముఖ్యధర్మంబు యనకహింసజేతురవనిసురలు చాప్రప
శువుమదిను ఛండాలుడే మేలువిశ్వదాభిరామవినరవేమ॥ ఆడువారిగన్న
అర్థంబుపొడగన్న సారమాంసరుచులు చవులుగన్న అయ్యగార్లకైన
ఆశలుబుట్టవా విశ్వదాభిరామవినరవేమా॥ శ్రీమద్భాగవత కృష్ణదేశిక
కృత క్షురక్షురోపాదిద్వయ దోషరహితపరమ తత్వకందార్థములు॥కం॥
అనుభవవేదాన్తులమని దినరానిపదార్థమెల్ల దినుదుర్జనులన్ గనబోకు
ము తద్బోధను వినబోకుమికెన్నటికి వివేకవిచారా॥ కం॥జహ్వోపస్థ
విషయము లెవ్విగలవో నానివిడువలేని గురువులన్ యెవ్వరు జేరిగొల్తు
రో యివ్వసుధను వారుజెడుదురిదినిజముసుమీ॥ ఇత్యాది ప్రమాణంబు
లచే జీవహింస మద్యమాంసాశుద్ధాశిభోజన జారచోరకృత్యా
దులన్ జేయుచు గురువులమని గురుపుత్రులమనిజెప్పుకొనుచు దూర్వా

సుగ్రీవలే కోపమున్ను దుర్యోధనువలె ధనాసక్తియు రావణు
నివలె జారత్వము మొదలగు కొంటెచేష్టలు జేయుచు దారా
పుత్రాదులనియెడి యీషణత్రయములలో దగులుకొని, తాపము
చే దుఃఖించుచుఁ దమకు జన్మలేదని నేను శుద్ధనిర్గుణపరబ్రహ్మ
మని, నాకు పుణ్యపాపంబులు, కష్టసుఖంబులు, లేవనిఁజెప్పుకొనుచు,
కష్టసుఖంబుల ననుభవింపుచు నేనీశ్వరుఁడననిఁ జెప్పుకొన్ననొప్ప దత
నికి మోక్షము లేదు. దీనివలన జన్మస్థితిమరణములు తప్పక గలుగును.
శృతిః॥ ఆత్మావా అరేద్రష్టవ్యః । శ్రోతవ్యోమన్తవ్యో నిధిధ్యాసితవ్యః।
అనెడి బృహదారణ్యోపనిషత్తురీతిని ఆత్మయిట్టిదని దెలిసి తత్స్వరూప
తత్థానంబులను స్వదేహంబున సద్గురుముఖముగా నెరిగి సర్వదా శ్రవ
ణమనన నిధిధ్యానాదులను జేయుటవలన అజ్ఞానవిపరీత సంశయంబు
నివర్తించి ముక్తిపొందవచ్చును గాన ముందు దేహమిట్టిదని తెలిసి పిద
ప దేహమందుండు యాత్మయిట్టిదని యెరుగవలయును॥శృతిః॥ ఆత్మావా
అరేద్రష్టవ్యః। శ్రోతవ్యో మన్తవ్యో నిధిధ్యాసితవ్యః॥ అనెడి బృహ
దారుణోపనిషత్తురీతిని ఆత్మయిట్టిదని అనగా జీవాత్మఇట్టిదని తత్స్వ
రూప తత్థానంబులు సద్గురుముఖముగా నెరిగి సదాశ్రవణమనన నిధి
ధ్యానాదులనుఁ జేయుటవలన నజ్ఞానవిపరీత సంశయంబు నివర్తించి
ముక్తిపొందవచ్చును. గాన ముందు ఆత్మస్వరూపమిట్టిదని దెలియవల
యును॥శృతిః॥ అశరీరంశరీరేషు అనవస్థేష్వవస్థితమ్ ఇతికఠోపనిషది॥
తా॥ ఆంజనేయా ఈశరీరమునందు ఆత్మ తనకు శరీరములేక నాశరహి
తుఁడై యున్నాఁడు. శృతిః॥ అస్తమితఆదిత్యే యాజ్ఞావల్క్యచంద్రమ
స్యస్తమితే రాత్రేశ్శాన్తాయాంవాచి కింజ్యోతిరేవాయం పురుషః।
ఇత్యాత్మైవాస్యజ్యోతిర్భవతి బృహదారుణ్యోపనిషత్॥ తా॥ సూర్యచం
ద్రప్రకాశములు లేనట్టి చీకటిసమయంబున నీకు దేహమున్నదనియు
ఈప్రపంచమున్నదనియు చీకటిత్రోచుచున్నదని యేజ్యోతిప్రకాశము
వలన నెరుఁగుచున్నావో అదే స్వయం జ్యోతియని ఆత్మయని

చెప్పబడు. యీశరీరంబున, ఆత్మలేనియెడల సూర్యచంద్రులు ప్రకాశించుచున్నను నీవు దేహమును నెరుగజాలవు ప్రపంచమునెరు గజాలవు సూర్యచంద్రాదులున్నారని యెరుగజాలవు. నీదేహమున ఆత్మవసించుటవలన అనగా నెరుకవసించుటవలన యెరుకయనగ తెలివి యిదియే స్వరూపము ఇదియే గురుగోప్యము ఇదియే గురుర హస్యము అనగా ప్రజ్ఞానము వసియించుటవలననే సర్వము నెరుగు చున్నావు॥ గీ॥ అధిపయిదిమర్మమంగధరాగ్రిమధ్య। వార్ధినడుమను కృష్ణాశ్రి యద్వారవతిని। ఆత్ముడున్నాడు సూక్ష్మదృష్టిచేత। యెరుకగలవాడవై గనుము సౌఖ్యదెలిసి॥ అని భారతము శాంతిప ర్వము ఆ నిర్గుణజ్ఞప్తియందుండగా పొలుపొందగా నిద్రబోయితి ననుచు, దెలియు వారెవ్వరు ఆతెలివిగాక॥ అని ప్రభులింగలీల ద్విపదకావ్యము. ఇత్యాది ప్రమాణంబులచే నిర్గుణజ్ఞప్తిమాత్ర స్వరూపంబైన ఆత్మయొక్క ప్రకాశమువలన అనగా తెలివివలన సూర్యచంద్రాదులు ప్రపంచము సర్వము గనుపడును. లేకున్న గనుపడవు కాబట్టి ఆత్మపరంజ్యోతియని, స్వప్రకాశమని జెప్పబడును. అనగా జీవాత్మ, అంతరాత్మ, ప్రత్యగాత్మ, పరమాత్మ, జీవుడు, యీశ్వరుడు, ప్రత్యగాత్ముడు, పరమాత్ముడని భావము. జీవేశ్వరు లిద్దరు, మలినయెరుకయనబడుదురు. ప్రత్యగాత్మ పరమాత్ములిద్దరు శుద్ధయెరుక యనబడుదురు. ఇట్లు గురుముఖంబుగా సాంఖ్యవిచారణ ముజేసి, స్వస్వరూపాను సంధానములేనివారికి పరిపూర్ణత్వము సిద్ధింపనేరదు. ఇది పిపీలికన్యాయము చెడనిపదవి. విహంగన్యాయ ముచే నొకవేళ సిద్ధించినను యదినిలువనేరదు. వారికిస్వానుభవము సిద్ధింపదు. గాన పిపీలికన్యాయముచే క్రమముగా తారకసాంఖ్య మనస్కములవిచారించి శుద్ధనిర్గుణపరిపూర్ణస్వరూపులుగావలయుననినా ప్రార్థన. శృతిః। యేనేదంసర్వంవిజానాతితం కేనవిజానీయాత్ విజ్ఞాతారమరే కేన విజానీయ్యాత్॥ ఇతిబృహదారుణ్యోపనిషత్॥ ఈశరీరమందు

ప్రజ్ఞానమనబడెడియాత్మ వసియించుటవలననే జగమునందు సకలజను లను నానావిధరూపములతోటి ప్రపంచము నెరుగుచున్నారు జ్ఞానస్వ రూపమైన ఆత్మయిట్టిదని యెరుగుటకు మరియొకజ్ఞానస్వరూపమైనవస్తు వుయున్నదనుట అసత్యమే అనగాఆత్మయే పరబ్రహ్మమనియు దానికం టె ప్రియమైనదియు శ్రేష్ఠమైనది మరియొకటి లేదని దెలియవలెను శృతిః॥ సంత్యజ్యహృద్గుహేశానం దేవమన్యం ప్రయాన్తియేతే రత్న మభివాంఛంతి। త్యక్తహస్తస్థకౌస్తుభాః॥తా॥హృదయమందున్న అనగా హృత్కమలమనబడె సహస్రారమందున్న ఆత్మదేవతను దెలియక వేరొక్కదైవమున్నదని భావించువారు హస్తమందున్న కౌస్తుభమణిని వదలి యెక్కడో దేవలోకమందున్నదని వెదకువారివలెతెలివిలేనివార గుచున్నారు। శృతిః॥ బహుశాస్త్రకథాకంథా రోమంథేనవృథైవకిం అన్వేష్టవ్యం ప్రయత్నేన మారుతేజ్యోతిరాంతరం॥ తా॥ ఓఆంజనేయా సర్వవేదశాస్త్రాది విద్యాపాఠనము జేయుటవలన ప్రయోజనములేదు. ముక్తినిబొందజాలవు ఈదేహమందు వసియించు స్వయంజ్యోతి స్వరూ పమైన పరబ్రహ్మమగు ఆత్మను అంతరంగదృష్టివలన నర్సించినయెడల ముక్తినిబొందుదువు॥ కఠోపనషది శ్రుతిః॥ గుహాయాంప్రవిష్టౌపరమే పరార్ధ్యే ఛాయాతపౌబ్రహ్మవిదోవదన్తి॥ తా॥ ఎండయు తత్ప్రతిబింబ మైననీడవలె పరబ్రహ్మమైనఆత్మయు పరబ్రహ్మఛాయమైజీవాత్మ వీరలిద్దరు నీదేహంబున సహస్రారగుహాయందున్నారు॥ శ్రుతిః॥ యఏ వం వేదాహంబ్రహ్మాస్మీతి॥ సఇదం సర్వంభవతి ఇతిబృహదారణ్యోప నిషది॥ తా॥ ఎవడు ఆత్మస్వరూపుడనగునేనే బ్రహ్మమని దెలుసుకొ నుచున్నాడో వాడు ఆపరబ్రహ్మమగుచున్నాడు॥శృతిః॥ అయమా త్మాబ్రహ్మ ఇతిమాండూక్యోపనిషది॥తా॥ఈశరీరమున నంతఃకరణ సాక్షిగానుండు ఆత్మయేపరబ్రహ్మము॥ శృతిః॥ త్వమేవాహంనభేదో స్తి పూర్ణత్వాత్పరమాత్మనః ఇతిమండలబ్రాహ్మణోపనిషత్॥ తా॥ ఓఆంజనేయా:నీవేనేను నేనేనీవు మనమిద్దరము కీపరిపూర్ణపరబ్రహ్మమ

గు ఆత్మస్వరూపులమే మనమిద్దరమేకపరబ్రహ్మమే మనకిద్దరికి సత్య
ముగానే భేదము లేదు॥ ఇత్యాద్యుపనషత్ప్రమాణంబులచే నాత్మఇట్టి
దనిగురుముఖముగా దెలియనివారికిగురు బ్రహ్మ గురుర్విష్ణుర్గురుర్దేవో మ
హేశ్వరః॥ గురుసాక్షాత్పరంబ్రహ్మ తస్మై శ్రీగురవేనమః॥ అనెడిప్ర
మాణంబు నెరుగక గురువులకులము గుణము నెంచు కొంటెశిష్యులకు
నట్టిశిష్యులకుపదేశ మొసగు గురువులకు జన్మము తప్పకగల్గును లోకాప
వాదముసిద్ధించును॥ గానసద్గురు సేవజేసి తారకసాంఖ్యామనస్కంబుల
క్రమంబుగావిచారించినవారికే శుద్ధనిర్గుణబ్రహ్మప్రాప్తి గలుగునని దె
లియును॥ శ్రుతిః॥ ఊర్ధ్వంప్రాణమున్నయత్యపానం ప్రత్యగస్యతి
మధ్యేవామనమాసీనం విశ్వేదేవాః ఉపాసతే ఇతికఠోపనిషది తా॥
ఓఆంజనేయా ఓంకారమే అనగాప్రణవమనబడెడి నాదబ్ర
హ్మమే సకలదేహములకు నాధారముగానున్నది సర్వదేహముల
యందు ప్రాణవాయువు రేచకంబున ఊర్ధ్వముగా వ్యాపిం
చిసంచరించు అపానవాయువు పూరకంబుగా నధోముఖముగా
వ్యాపించిసంచరించు ఈరెంటినినగా ప్రాణాపానములనొకటిగాజేసి
ఈరెంటికిమధ్యనున్న బిందుగతమైనఆత్మను కుంభకముచే బ్రహ్మరు
ద్రాదిదేవతలు సదాఉపాసింతురు॥ పూరకంబునహకారంబు పొందు
పరచి కుంభకంబునబిందుపూర్వగూర్చియంత రేచకంబునసకారంబు
జూచివాని దెలియు తెలివియె నేనని దెలియవలయు నిత్యాదిప్రమా
ణంబులచే రేచకపూరకకుంభకాదుల మోక్షద్వారమనబడెడియంతర్సు
షుమ్నాద్వారాయభ్యాసము జేసి అనగా మొదట బహిర్సుషుమ్నాద్వా
రాబాహ్య రేచకపూరకకుంభకములచే నభ్యసించి పిదపనంతర్సుషు
మ్నాద్వారా యభ్యాసము జేయవలయును. ఈరహస్యంబు
యోగీశ్వరులైన సద్గురువుల సేవజేసి గ్రహించి జేయవలెను. ఇట్ల
భ్యాసము జేసినవారికి తమదేహమందుండెడి నాదబ్రహ్మమెప్పుడు
ప్రత్యక్షానుభవముగా వినబడుచుండును తన్నాదబ్రహ్మమునుగని

పెట్టినవారలు తమకుసన్నిహితకాలంబున నాదానుభవమునుచూచు
కొని నాదబ్రహ్మము లయించిపోవుచుండగా నేనుబ్రహ్మముం దైక్య
మగుదునని శిష్యులతో జెప్పి సమాధిస్థులగుచున్నారు। మరియు నీనాద
బ్రహ్మమునిత్యము సోహం భావము జేసినగాని సిద్ధిగానేరదు। ఈసోహం
భావమేహంసయనబడును॥ ఇతనివలననే ప్రాణాపానంబులు సంచ
రించుచుండు। శ్రుతిః॥ ప్రాణాపానవశాజ్జీవో హ్యధశ్చోర్ధ్వం ప్రధా
వతి వామదక్షిణమార్గేణ సంచలత్వాన్నదృశ్యతే ఆక్షిప్తభుజ
దండేన యథోచ్చలతికందుకః ప్రాణాపానసమాక్షిప్తా తద్వజ్జీవోనవి
శ్రమేత్ అపానాత్కర్షతిప్రాణోపానః ప్రాణాచ్చకర్షతి ఖగరజ్జువదిత్యే
వత్ యోజానాతిసయోగవిత్ హకారేణబహిర్యాతి సకారేణవ
సేత్పునఃహంసహంసేత్యామన్త్రంజీవోజపతిసర్వదా॥ ఇతిధ్యానబిందూ
పనిషది। తా॥ ఓఆంజనేయా బాలకులుహస్తముచే నెగరవేయబడిన
బంతి క్రిందికినెగురుచు పడుచుండునట్లు ప్రాణాపానవాయువులు
రెండునుయీదేహమధ్యంబునషడాధారములయందు పైకిక్రిందికి నెక్కు
చుదిగుచు ప్రతిదినము ఇరువదియొక్క వేల ఆరునూరుసార్లు సూర్యోద
యముమొదలు మరల సూర్యోదయమువరకు రేచకపూరకంబులన
నాసికాద్వారములగుండా ద్వాదశాంగుష్టాంగుళములవరకు బైటకి
వచ్చును లోపలికిబోవును॥ అనగా పదిరెండంగుళములుబైటకివచ్చును
యెనిమిదిఅంగుళములు లోపలికిబోవును॥ ఈప్రకారము ఇడయనెడి
సూర్యనాడినుండి పింగళయనెడి చంద్రనాడిమార్గముగాను పింగళయ
నెడిచంద్రనాడినుండి ఇడయనెడిసూర్యనాడిమార్గముగాను మారిమారి
తిరుగుచుండును ఈహంసనడకను అనగాస్వరపరీక్షను స్వరశాస్త్రిను
సారముగా సద్గురునివలనగ్రహించి స్వరపరీక్షజేసినవానికి శుభాశుభం
బులుదెలియును। మరియునీహంస ఒకత్రాటియందుగట్టబడినపక్షిని,
ఆత్రాడేప్రకారముగాలాగుచుండునో అట్లె ఈరేచకపూరకములనెడి
ప్రాణాపానంబులురెండు తమనడుమనుండేబిందుర్గతమైనజీవుని పైకి

క్రిందిపీడ్చుచుండును ఈప్రాణాపానంబులసంచారమెవ్వడునిల్పునో వాడే చిరకాలజీవియై యుండును॥ ఈశీవ్రము ప్రాణాపానముల ద్వారా హంసకీలకంబగు (సోహం) యనెడిద్వ్యక్షరీమన్త్రంబును తనకుదానే సదా జపించుచుండును॥ ఈసద్గురురహస్యము దెలసిపాటుపడిన వారేరాజయోగులు గానిమరియొకరుగానేరరు॥ అచ్చుపడముద్రిలెన్నుచు మచ్చికమీరంగ మనసు మరిగినమీదట విచ్చలవిడిరమియింపుచు మెచ్చినదేముక్తికిరువు మేదినివేమా॥ అరసికట్టజేసియాధార చక్రంబుప్రాణవాయునందె పదిలపరచి యెడతెగకనేయుండు నిల యోగ్యుడగుయోగి విశ్వదాభిరామవినురవేమా॥ ఇడపింగళనాడులకును నడుమసుషుమ్నయు వెలింగినాడుచునుండును కడుదుస్తర మదిగనగా నడుమనెయినశశియు హరునినగరము వేమా॥ ఉన్నదానిగాంచు ఊపిరిబిగబట్టి గన్నుమూసి యేమిగానలేవు విన్నదన్నెరుక విజ్ఞానమందురు విశ్వదాభిరామవినురవేమా॥ తా॥ వాయుధారణములేక కన్నులుమూసికూర్చున్నమాత్రమునసే సమాధిగానేరదు మానసచంచలత్వమణుగదు॥ నాటివినుచుండు ప్రణవంబు నాకమందు సూటిదప్పక మదియందు సూత్రపరచి కోటదాటిన నిశ్చబ్దకూటమగును విశ్వదాభిరామవినరవేమా॥ నాదముముక్తికి తెరవగు పాదునుదెలియంగనగును పరిపక్వముతో భేదంబుమాని మదిలో వేదికపై జేరివినుము వినుకవేమా॥ అష్టదళములకును నాధారమైనట్టి యాదిదేవుడొకడె యఖిలజగత్త్రయముదాటి వాడుదానెపరబ్రహ్మంబు విశ్వదాభిరామ వినరవేమా॥ ఊపిరిలోసికిలాగుచు ప్రాపుగలో నిలువజూచి బనుపుగవిడచుచు జూపోర్చునిబయలందున గాపుగనీలోనె నిన్నుగనవలె వేమా॥ యెడమ కుడినాడులకు మధ్య యీడ్చిగాలి తడవతడవకుబిగబట్టి తాల్మితోడ విడచులాగుచు విన్నందువెలయుచుండు విశ్వదాభిరామవినరవేమా. నొకచిన్నబిలముజొరగా సకలంకుపితేజమందె యావరణంబై నికరంబుగజూపట్టును; సకలంబును సమయుజోడు సరగునవేమా. ముక్క-

బిగియించ కేగాలి మూటగట్టి పట్టపస లేనిబయలును పాక నేర్చి
అద్భుతానందమును జెందునతడు యోగి విశ్వదాభిరామ వినర వేమా.
చెవులలోనబుట్టి రవమెయాకాశంబు గన్నులగనునదియె కళ యు
జ్వాల ముక్కులోనిగాలి ముక్తికిత్రోవరా విశ్వదాభిరామ
వినర వేమా॥ మొదట స్వమతమును వదలక తుదినెవ్వరి మతమునైన
దూషింపకయుండ పదపడికోర్కెలు గోరక మునమున నటియించు
వాడె ముఖ్యుడు వేమా॥ వాయువు బయలునబుట్టెను వాయువె
బయలందు అణగివచ్చుచునుండును వాయువునుబట్టి కుంభక వాయు
వులో గలయువాడె వశ్యుడు వేమా॥ వినవలెదశవిధనాదము గనవలె
నిర్భేదపదము గాంచినపైపై గనవలె సోహంభావము మనవలెపరి
పూర్ణమూని మదిలో వేమా॥ సాంఖ్యతారకముద్రలు సంతసమున।
గురుముఖంబున నెరిగియు గుట్టువిడక। నిరతమాత్మావలోకన నెరపు
యోగి। విశ్వదాభిరామ వినర వేమా॥ హంసయోగము సరిసాటియ
వనిగలదె। శంసమించిన మదిలోన శంకరుండు। ధ్వంసమొనరించి
యెరుకను దర్పమణచు। విశ్వదాభిరామ వినర వేమా॥ హంసధ్యా
నములోనైన అనుభవంబు। సంశయంబుల ద్రుంచిన సత్యమమరు।
ధ్వంసమగు లోకవాసన తన్మయంబు। విశ్వదాభిరామ వినర వేమా॥
చూపుచెదరనివృత్తితో చూటిక్కనంటి। యేపుమీరిన మదియందు
రూపుమాపి। తన్ను తా గాంచుచుండును తత్వవేత్త। విశ్వదాభిరామ
వినర వేమా॥ బట్టబయలందు వాయువు। పట్టుకదానిల్పిదనలో పనిబడి
గనిన దిట్టముగ జగముగిట్టును। పుట్టుడు గిట్టుడును నతడు పొందుగ
బసవా॥ మరియు సర్వేంద్రియములకు మనసురాజు। మనసునకురాజు
జూడంగ మారుతంబు। మనసుమారుత మొకటైన మలయు సుఖము।
నవ్యతరభోగి శ్రీసదానందయోగి॥ యోగాభ్యాసమొనర్పక రాగంబు
లమాని శివుని రయమున దలచి చిద్భోగానందముజెందక యోగుల
మనుకొన్న ముక్తియొసగునె బసవా॥ ఇత్యాదిప్రమాణంబులచే,

యోగాభ్యాస మొనర్పక ముక్తిలేదని స్పష్టముగా దెలియు
చున్నది॥ శ్రుతిః॥ జ్ఞానాత్స్వరూపం। పరమ హంస
మన్త్రం సముచ్చరేత్ । ప్రాగినాం దేహమధ్యే
తు। స్థితోహంసస్సదాచ్యుతః। హంసతవపరంసత్యం హంసతవమశక్తి
కం। హంసఏవపరంవాక్యం। హంసఏవతువైదికం। హంసఏవపరోరుద్రః
హంసఏవపరాత్పరః ఇతి బ్రహ్మవిద్యోపనిషది। తా॥ ఆత్మసర్వజంతు
వుల శరీరమధ్యంబున, హంసస్వరూపంబుననుండుచు శ్రుతిః॥ సోహ
మపాపోవిరజోనిర్ముక్తః అనెడిత్రైత్తిరీయోపనిషత్తుగీతిగాను॥ శ్రుతి॥
ఏషో౽సౌపరమహంసో। భానుకోటి ప్రతీకాశో యేనేదం సర్వంవ్యా
ప్తం। తస్యాష్టధావృత్తిర్భవతి। పూర్వేదళేపుణ్యమతిరాగ్నేయ నిద్రా
లస్యాదయోభవన్తి। యామ్యే క్రౌర్యమతిర్నైఋతిపాపేమనీషా వారు
ణ్యాంక్రీడా। వాయవ్యాంగమనాదౌబుద్ధి సౌమ్యేరతి ప్రీతిరీశాన్యేద్ర
వ్యదానం। మధ్యేవైరాగ్యం। కేసరేజాగ్రదావస్థాకర్ణికాయాంస్వప్నో
లింగేసుషుప్తిః। పద్మత్యాగేతురీయ్యం। యదాహంసోనాదేవిలీనోభవతి
తత్తురియ్యాతీతంభవతి। అధోనాదఆధారాది బ్రహ్మరంధ్రపర్యంతం
శుద్ధస్ఫటికసంకాశంవై । బ్రహ్మ పరమాత్మేత్యుచ్యతే॥ అనెడి హం
సోపనిషద్గీతిగాను సర్వదేహములయందు హంససంచరించుటవలననే
సర్వజీవులకు జాగ్రత్స్వప్నసుషుప్తితుర్యతుర్యాతీతావస్థలును పుణ్యబుద్ధి
నిద్రాలస్యాదులు క్రూరబుద్ధి పాపకృత్యము క్రీడాబుద్ధి చలనబుద్ధి రతి
ప్రీతి ద్రవ్యదానము వైరాగ్యము మొదలగునవ్యక్తులుగలుగుచున్నవి
యెప్పుడుహంస నాదబ్రహ్మమందులీనమగునో అప్పుడేతుర్యాతీతావ
స్థయు పరమాత్మయగుచున్నది॥ గానసోహంభావమును దెలసినవారలే
పరమహంసలు హంసరాకపోకడ దెలసినవారలే జీవన్ముక్తులు
సర్వదేహంబులందు నీహంస సంచరించుటవలననే వారు జీవిం
చియుందురు. లేకున్న జీవించరుగాబట్టి ఇదియే సత్యస్వరూపు
డు ఇతడే పరాత్పరుడు ఇతనిపలుకేసోహము ఇదియేసూచన ఇదియే

శ్రేష్ఠమైనమంత్రము దీనిరహస్యమేసోహంభావము ఈసోహంభావమే బ్రహ్మైక్యము గలిగించుటకు కారణమైనది. ఇదియే హంససూత్రము ఇదియేగురుగోప్యము దీనిరహస్యమును సుగుముఖముగా నెరిగి యెల్లపు డు తన్నిష్ఠలోనుండనివారు సన్యాసాశ్రమనిరతులైనను వారికిమోక్ష ము లేదు॥ శృతిః॥ సశిఖాంవపనంకృత్వా బహిస్సూత్రం త్యజేద్బుధః బ్రహ్మసూత్రమిదంజ్ఞేయం సూత్రం నామపరంపదం తత్సూత్రంధార యేద్యోగి సవిప్రోవేదపారగః ఇతిబ్రహ్మోపనిషది॥ హంసహంసేతి యోబ్రూయాత్ హంసోనామసదాశివః గురువక్త్రాత్తులభ్యేతే ప్రత్యక్ష స్సర్వతోముఖం॥ ఇత్యాదిప్రమాణంబులచే హంససూత్రస్వరూపంబై న సాంఖ్యము మోక్షమార్గమని యుపనిషత్తులు బోధించుచున్నవి! యివియెరిగియెరుగని నవీనవేదాన్తులుకొందరు తారకసాంఖ్యములతో నవసరములేదని బల్కుచు వీనిని విచారించక పరిపూర్ణత్వసిద్ధియగునని బల్కెదరు. అందువలనవారికి శుద్ధనిర్గుణబ్రహ్మైక్యజ్ఞానము సిద్ధింపనేరదు ముందుదేహస్వరూపమిట్టిదని దెలియక దేహమున కన్తరమందున్న యెరుక అనగా ఆత్మ యిట్టిదనిదెలియదు. ఆత్మఇట్టిదనిదెలియక పరి పూర్ణత్వసిద్ధిగానేరదు. సాంఖ్యమెరుగనివారలకు సంకెళ్లువిడునవను లోకోక్తిచే అనగా తత్వవిచారణలేనివారికి సంసారబంధము విడువదనె డిమాటచే ముందుతారకసాంఖ్యముల విచారించి పిదపపరిపూర్ణుడుగా వలయును॥ యెరుకఅనగాకట్టెవంటిది ఖండపరిపూర్ణమనగా నిప్పువం టిది అఖండపరిపూర్ణమనగా బూడిదెవంటిది॥ కట్టెకుఅంతరమందుని ప్పున్నూ నిప్పుకుఅంతరమందు బూడిదెయున్నట్టు దేహమునకన్తర మందు ఖండపరిపూర్ణమున్నూ అనగా ప్రత్యగాత్మపరమాత్మలనేశుద్ధ యెరుకయు ఖండపరిపూర్ణమనే ప్రత్యగాత్మపరమాత్మలకంతరమందు యేమీగానియీరిత్తబట్టబయలనే అఖండపరిపూర్ణమున్నది॥యదియేపిం డాండబ్రహ్మాండములయందంతటనిండినిబిడీకృతంబై యున్నది॥ యెట్లుకట్టె నుమథింపక కట్టెయందుండెడియగ్ని బుట్టదో అట్టెదేహమునువిచారించ

క దేహమందుండెడియాత్మస్వరూపము దెలియదు ఎట్లు అగ్ని చల్లారక బూడి దెగాదో యట్లు తను వెరుకలవదలక నన గాననిత్యమని భ్రాంతిజన్యము లే గాని లేనివని యెరుగక పరిపూర్ణత్వసిద్ధిగా నేరదు. గాన సద్గురుపుత్రులు మతోదరులునగువారందరు లోకంబునంగల సద్గురువులు గురుపుత్రు లందరు మద్విజ్ఞాపనమాలకించి మత్ప్రియశిష్యుండైనపణిదెము నాగలిం గముగారిచే వ్రాయబడినహంసప్రశ్నోత్తరములకనుసారముగా పాను గంటికోటిలింగశాస్త్రిచే రచియింపబడిన నీహంసతత్వకందార్థదరువు లగాంచి పొరపాటువలనగలిగినతప్పులున్న నొప్పుగా నెంచి యేతద్గ్రం బునుజదివి తత్తదనుభవముల జదివి కొన్నికొన్ని సాంకేతపదార్థంబుల తదనుభవంబుల దెలియనియెడల తత్సాంప్రదాయకగురుశిష్యులద్వారా గ్రహించి స్వానుభవపరులై పరమహంసలై పిదప శ్రీమదఖండపరి పూర్ణశుద్ధనిర్గుణతత్వమును విచారించి యచంచలులై శుద్ధనిర్గుణబ్రహ్మ మందైక్యమగుదురని యెల్లపుడు వేలువేలువిధముగా ప్రార్థింపు చున్నాడను.

మరియునీగ్రంధము॥ మాత్రయునొక్కలఘువనెడి సులక్షణసా రోక్తిచే లక్షణయుతముగానె యున్నది.

ఇట్లు,

గుంటూరుపురవాసి సుజనవిధేయులు-విశ్వబ్రాహ్మణులు.

బ్రహ్మశ్రీ మదుపు సుబ్బయాచార్యులువారు

ఓం

* సద్గురుచరణారవిందార్పణమస్తు *



# గురుపూజావిధిః

ఓం.

సద్గురుపరబ్రహ్మణేనమః.

## శ్రీమద్గురుపరంపరాష్టకమ్.

శ్లో॥ శ్రీధరస్వామినంవందే సర్వకారణకారణమ్ నిర్ధూతసర్వసం సారవాసనాదోషపంజరం॥ ౧॥ రామమడుగుకులేజాతం। శివరామసు దీక్షితం వేదవేదాంగధర్మజ్ఞం శుద్ధనిర్గుణబోధనం॥ ౨॥ శ్రీకంబలూరి వంశాబ్ధా సంభూతంసర్వనాయకం వందేహ మప్పరావాఖ్యం సద్గురుం సర్వకారణం॥3॥ శ్రీపరిశకులేజాతం శివాద్వైతార్థవాదినం చన్నయా ఖ్యగురుంవందే జంగమేశంసదాముదా॥ ౪ మల్లిపెద్ది కులేజాతం కృష్ణ బ్రహ్మయ్యదేశికం శిష్యహృత్పద్మసంశేవ్యం భజామిసర్వకారణమ్॥ ౫॥ సచ్చిదానందరహితం శుభకర్ణశింగ్గప్రిభుం శ్రీకంచ్యాన్వయసంభూ తం రామానందగురుంభజే॥ ౬॥ శ్రీతూముటూరి వంశాబ్ధా సంభూతం సర్వనాయకం భజేహంరామయార్యంవై శాస్త్రిణంసద్గురుంసదా॥ ౭॥ భజేహంసుబ్బయాచార్యం మడుపాన్వయదీపకం శ్రీయచ్చమాంబా ప్రాణేశం విశ్వబ్రాహ్మణవంశజం॥ ౮॥ శ్రీపానుగంటికోటీశ స్వామినం సత్యవాదినం శ్రీశివాద్వైతిసిద్ధాంత కర్తారంసద్గురుంభజే॥

శ్రీపానుగంటికోటీశ జంగమ
దేవరనాకృతమ్ చేతస్సర్వా
ష్టకందివ్యంయఃపఠేద్వి
సముక్తిమాగ్॥
ఓం తత్సత్.

ఓం

శ్రీమన్మధుపు, సుబ్బయాచార్య సద్గురుపరబ్రహ్మణేనమః.

శ్లో॥ శ్రీగుంటూర్పురవాసినంచసతతం శిష్యౌఘసంపూజితం విశ్వబ్రాహ్మణశేఖరం సుఖకరం వేదార్థసంబోధినం సంజాతంమధుపాన్వయేతువిమలే శ్రీయచ్చమాంబాపతిం శిష్యానందనిధింభజామిసుగురుం శ్రీసుబ్బయాచారిణం॥ శ్రీమన్మధుపు వంశాబ్ధి బాలచంద్రనిభప్రభ మద్గురోసుబ్బయాచార్య అత్రాగచ్ఛమహాప్రభో॥ ॥ఆవాహయామి॥ శ్రీగుంటూర్పురసంవాసిన్ శిష్యపాపౌఘసంహార ఇదమాసనంచామోఘంస్వీకురుకరుణాకర॥ ఆసనంసమర్పయామి" శ్రీయచ్చమాంబాప్రాణేశ శిష్యౌఘనుతపాదుక సమర్పయామిచేదంవై పాద్యం స్వీకురుదేశిక॥ పాదయోః పాద్యంసమర్పయామి॥ శ్రీరామలింగారిస ద్రామ శాస్త్రిశిష్యమహామతే అహమాచమనీయ్యంవై తవార్పయామిసద్గురో॥ అచమనీయంసమర్పయామి॥

స్నానం

కలశపూజావిధిః

శ్లో॥ కలశస్యముఖేవిష్ణుః కంఠేరుద్రసమాశ్రితః మూలేతత్రస్థితో బ్రహ్మ మధ్యేమాతృగణాస్మృతాః॥ కుక్షౌతుసాగరాస్సర్వే సప్తద్వీపావసుంధరా ఋగ్వేదోథయజుర్వేదస్సామవేదోహ్యథర్వణః అంగైశ్చసహితాస్సర్వే కలశాంబుసమాశ్రితాః ఏతన్మంత్రేణ కలశం గంధపుష్పాక్షత ధూపదీపనైవేద్యతాంబూలాదిభిస్సంపూజ్య తత్కలశోదకేన స్వాభిముఖ గురుపాదాభిషేచనంకుర్యాదేవంత్రిః పర్యాయం స్థూలసూక్ష్మకారణదేహాన్ పాదార్చనం జలగంధాక్షతపుష్పధూపదీపనైవేద్యతాంబూలాదిభిః కృత్వా॥ తతస్సద్గురుపాదాంగుష్ఠయోః విభూత్యా ప్రణవపంచాక్షరీమంత్రంచ హంసమంత్రంచ సంలిఖ్య॥హంక్షంభ్యాం ద్విహ్యేతపత్రకమలై ద్విశ్వైజగత్కారణం శిశ్నోత్తీర్ణమనేకదేహనిలయం స్వేచ్ఛరిదమానందకం ఆద్యంతైకమఖండ చిద్భువన సంపూర్ణమనంతంశుభం ప్రత్యక్షాక్షరవిగ్రహం గురుపదంధ్యాయేద్విభుశ్శాశ్వ

తం॥ ఇతిమంత్రింపఠిత్వాగురుపాదయోః ధూపదీపాదికందత్వా తతఃక లశస్థ నారికేళఫలోదకేన అభిషేచ్య తత స్సద్గురుపాదతీర్థ మేకపాత్రే నిక్షిప్త్వా గురుపాదాంగుష్ఠాధఃప్రదేశే తతీర్థపాత్రింవినిక్షిపేత్ తతశ్చ్వే తవ స్త్రేణగురుపాదాసంస్పృశేత్ ॥ అధ॥ భూతిర్భూతికరీ పవిత్రజననీ పాపౌఘవిధ్వంసినీ సర్వోపద్రవవినాశినీ శుభకరీ సర్వార్థ సంపత్కరీ భూతప్రేతపిశాచ రాక్షసగణా దుష్టౌఘసంహారిణీ తేజోరాజ్యవిశేష మోక్షసుకరీ భూతిస్సదాధార్యతాం॥ భూతింసమర్పయామి॥శ్లో॥శ్రీమ న్మదుపువంశాబ్ధి తాకేశ్వరమహాగురో సమర్పయామిశ్రీగంధం కర్పూ రాగరుసంయుతం॥ శ్రీకర్పూరాగరు సమాయుక్త గంధం సమర్పయా మి॥శ్రీగుంటూర్పురవా స్తవ్యం విశ్వబ్రాహ్మణశేఖర। శ్వేతాక్షతానహం తుభ్యం వై సమర్ప్యామి దేశిక। అక్షతాః సమర్పయామి॥ శ్లో॥ జాజీ చంపకపున్నాగ కుసుమాని బిల్వానిచ। తవార్పయామ్యహంభ క్త స్సుబ్బయ్యాచార్య సద్గురోపుష్పైస్సు బిల్వదళైశ్చ పూజాయామి॥ 1

నవపుష్పనామ పూజ.

ఓం శ్రీ మద్వేదాగమోక్త విరాడ్విశ్వబ్రహ్మ। ముఖోద్భవ విశ్వబ్రాహ్మణ సద్గురవేనమః ఓం॥

సుపర్ణసగోత్ర సన్నిజనితాయనమః ఓం 2॥ విశ్వజ్ఞసూత్రాయ నమః ఓం॥ 3॥ ప్రణవశాఖాకవితాయ నమః ఓం॥ 4॥ శ్రీ మన్మదుపు వంశాంబుధి సుధాకరాయనమః ఓం॥ 5॥ శ్రీ మద్గుంటూరుపురవే దాన్త పీఠాధ్యక్షాయనమః ఓం 6। శ్రీ యచ్చమాంబా ప్రాణేశ్వ రాయనమః ఓం॥ 7॥ శ్రీమద్గోవిందమాంబా విశ్వజ్ఞాచార్య జనకాయ నమః ఓం॥ 8॥ శ్రీ మత్స్వాములూరి రామశాస్త్రిసద్గురుదత్త గురు పట్టాధికారవిరాజమాన గురుశింహాస నాధ్యక్షాయనమః ఓం॥9

నక్షత్రమాలాపుష్పపూజ.

శ్రీ ధరస్వామిదేశికేంద్రసాంప్రదాయక పరంపరాయనమః ఓం 1॥ శ్రీ మత్స్వాములూరి రామశాస్త్రిదేశికేంద్ర దత్తగురు

పట్టాధరాయనమః ఓం 2॥ శ్రీ మన్మదుపు సుబ్బయాచార్యసద్గురు పరబ్రహ్మణేనమః ఓం 3॥ యమనియమాసన ప్రాణాయామప్రత్యాహారధ్యానధారణ సమాధ్యష్టాంగయోగా నుష్ఠానగరిష్ఠాయనమః ఓం 4॥ యోగదండకమండల కృష్ణాజిన పాదుకాధరాయనమః ఓం 5॥ సువర్ణయజ్ఞోపవీత రత్నకుండలధరాయనమః ఓం 6॥ పిండబ్రహ్మాండ సంబంధబోధార్ణవ సుధాకరాయనమః ఓం 7॥ బ్రహ్మాండపంచీకరణ సిద్ధాన్తసమర్థాయనమః ఓం 8॥ ప్రజ్ఞానానుభవన సూత్రరత్నావళి కర్తృణేనమః ఓం 9॥ శ్రీ మదష్టదళపద్మ నివాసగుహాగూఢ సూచన గురవేనమః ఓం 10॥ చతుర్విధసగుణ నిర్గుణమహావాక్యరహస్యార్థ బోధినేనమః ఓం 11॥ జీవేశ్వరప్రత్యగాత్మ పరమాత్మానుభవార్థబోధినేనమః ఓం 12॥ సాలోక్యసామీప్యసారూప్య సాయుజ్యానుభవబోధినేనమః ఓం 13॥ శ్రీ హంసతత్వకందార్థ రహస్యార్థవేదినేనమః ఓం 14॥ శ్రీ మచ్ఛిష్యశతశిష్యసంపూజిత సౌవర్ణపాదుకాయనమః ఓం 15॥ శ్రీ మన్స్థూలప్రణవ సూక్ష్మప్రణవకారణ ప్రణవ మహాకారణ ప్రణవ రహస్యార్థబోధా నిరతాయనమః ఓం 16॥ శ్రీ హంసనూత్ర బోధా సమర్థన ధురంధరాయనమః ఓం 17॥ శ్రీమద్వాదశిపంచదశిషోడ శ్యాదిమహామన్త్రమన్త్రార్థమన్త్రరహస్య మన్త్రసారనామకచతుర్విధపదరహస్యాను భవబోధాసమర్థదేశికేంద్రాయనమఃఓం 18॥ శ్రీమత్సర్వసంసారదుఃఖనాశన కరసద్గురవేనమఃఓం 19॥ బహిరన్తరతీర్థప్రసాదరహస్యార్థ సంవేదినేనమః ఓం 20॥ శిష్యాపాటవివీతిహ్వాన్తాయనమః ఓం 21॥ వేదోపనిషన్మంత్ర సారపుష్పరసభృంగాయనమఃఓం22॥దురాచారదుష్టసంగ మఖండనాయనమః ఓం 23॥ సదాచారశిష్టసంగమనిరతాయనమః ఓం 24॥ కామాంధకారభాస్కర సన్నిభాయనమఃఓం 25॥ స్వశిష్యస్వస్వరూపజ్ఞాన ప్రదాయినేనమః26॥ శ్రీమత్పశ్చిమచక్రసింహాసనాధీశాయనమఃఓం 27॥ నానావిధ పరిమళోపేతపుష్పపత్రాణిపవిత్రాణిసమర్పయామి॥ దేశికేంద్ర

మహాభాగ సుబ్బయాచార్యసుప్రభో ఇందదద్యామిధూపంతే గృహాణ కరుణాకర॥ ధూపంసమర్పయామి॥ గోఘృతేనసమాయుక్తం త్రివర్తి సంయుతంవరం గృహాణదీపందద్యామి సుబ్బయాచార్యసద్గురో॥ దీపం సమర్పయామి॥ శ్లో॥ దాడిమాదిఫలసంయుక్తం సుబ్బయాచార్యసద్గురో తవార్పయామినైవేద్యం స్వీకురుకరుణానిధే॥ నైవేద్యంసమర్పయామి శ్లో॥ నాగవల్లీదళైర్యుక్తంపూగీఫలవిశిష్టకం తవార్పయామితాంబూలం సుబ్బయాచార్యసద్గురో॥ తాంబూలంసమర్పయామి బ్రహ్మవిష్ణుమహా దేవపరబ్రహ్మస్వరూపక మన్త్రపుష్పంచార్పయామి సుబ్బయాచార్యస ద్గురో॥ మన్త్రశూన్యంక్రియాశూన్యం సుబ్బయాచార్యసద్గురో యత్పూ జితంమయాసర్వం పరిపూర్ణంతదస్తుతే॥ సర్వోపచారపూజాంసమర్ప యామి॥

శ్రీపానుగంటికోటిశ జంగమ
దేవరనాకృతం ఏతత్సద్గురుపూజంతు
యఃకుర్యాద్భవసముక్తిమాన్ ॥ శ్రీమన్మడు
పుసుబ్బయాచార్యసద్గురుపరబ్రహ్మార్పణమస్తు॥





# హంసతత్త్వకందార్ధదరువులు.

ఓం

సద్గురుపరబ్రహ్మణేనమః

గురుస్తుతిః

శ్లో॥ శ్రీ గుంటూర్పురవాసినంచసతతం శిష్యౌఘసంపూజితం।
విశ్వబ్రాహ్మణశేఖరం సుఖకరం వేదార్థసంబోధనం
సంజాతం మనుపాన్వయేతువిమలే శ్రీయచ్చమాంబాపతిం।
శిష్యానందనిధింభజామిసుగురుం శ్రీసుబ్బయాచారిణం॥

1. ఏతద్గురు వంశపరంపరాస్తుతిః చుట్టు కందార్థములు.

శ్రీధరస్వామిదేశిక పాదంబులు మదినిదలచి భక్తిదలిర్పన్ సాధు
నితద్గురుశిష్యుని మోదాత్ముని రామమనుగు ముఖ్యకులజాతున్ శివ
రామదీక్షితులను దలపోతున్ బోధానందు కంబలూరి యప్పారావున్
వేదాంతవేద్యునివిరివిగదలచెద సీధరణి తచ్ఛిష్య శేఖరు విశదచరలింగే
శ్వరుని శేవ్యని నాదరంబున పరిశెచన్నయాఖ్య దేశికునర్చించెద ముఖ్య
కులజాతున్ శివరామదీక్షితులను దలపోతున్॥ 1

పరిశెచన్నయ్యసద్గురు వరశిష్యునిమల్లిపెద్ది వంశసుజాతున్
ధరకృష్ణబ్రహ్మయాఖ్యుల గురువర్యులమదినిదలతు కోర్కెలలరంగా
తచ్ఛిష్యుడై ఖ్యాతివెలుగంగ బరగిన శుభకర్ణపరమశింగ్రిప్రభువున్
చరణపద్మంబుల శ్రద్ధచేనర్చింతు సరసతన్ శ్రీతూములూరి సద్రామ
శాస్త్రిగురునకు పరమకారుణ్యపూరుడయ్యు పరిధవిల్లినవానిదలతున్
కోర్కెలలరంగా॥ 2

## చుట్టుకందార్థము.

ధరణిన శ్రీకంచాన్వయ వరరామానందయోగీశ్వరబోధా గురుశిష్యుడయ్యు వెలశిన సరసుని శ్రీకామలూరి సద్వంశజాతుల్ వర రామాశాస్త్రులనుపూజింతుఁ అరయగతద్గురుపరమశిష్యుండైన సరస మడుపుసుబ్బయ్యాచార్యు వర్ణింతుఁ పరగసిగురుశేఖరులకుపరమశిష్యు లయ్యు వెలశిన గురుపుత్రులనెపుడు దలతు కోర్కెలుప్పతిల్లమనమున సద్వంశజాతుల్ వరరామాశాస్త్రులను పూజింతుఁ॥ 3

## 2 హంసస్తుతి

శ్రీపరమహంసయనగను ప్రాపుగనీసర్వభూత పటలములోన న్నే పలరగనివసించెడి యాపరబ్రహ్మంబునెపుడు నభినుతిజేతుఁ హంసే బ్రహ్మమనిదలపోతుఁ పాపరహితంబైనబలుసోహంభావమున ప్రాపు గవెలుగొందు పరమహంసలనెపుడు నభినుతిజేతుఁ హంసేబ్రహ్మమని దలపోతుఁ॥ 4

తొమ్మిదిస్థానములందున నెమ్మదినడిబాటలోన నెలవైయెపు డుఁ కమ్మియుతనువులనెల్లను నిమ్ముగవశియించుహంసనెప్పుడు దల తుఁ హంసేబ్రహ్మమనిదలపోతుఁ కమ్మిబ్రహ్మాండమున కదలగ చల మురీతి నెమ్మిపిండాండముల నిండినహంసను నెప్పుడుదలతుఁ హంసే బ్రహ్మమని దలపోతుఁ॥ 5

నిగమాగమ స్మృతులందున నగణితోపనిషత్తులందు నానావెం బలరఁ తగపౌరాణపు కథలున తగవేమియులేకనుండె తథ్యమిట్లను చు హంసేబ్రహ్మమనియెతానను చు నగశితదేహముల నటియింపుచుం డియు తగభేదమెమిలేక తానే బ్రహ్మంబనుచు తథ్యమిట్లనుచు హంసే బ్రహ్మమదియేతాననుచు॥ 6

హంసేప్రకృతిపురుషులు హంసేశివజీవులరయ హంసేపరిత్య క్కు హంసేపరమాత్మయునగు హంసనుదెలసినవాడే, హంసరూపుండు హంసేబ్రహ్మమని దలచుచుండు హంసస్వరూపంబు, హంసనడకలదెలశి

హంసస్వరూపులౌ పరమహంసలగొల్తు హంసరూపుండు హంసేబ్రహ్మ
మని దలచుచుండు॥ 7

3 కులగురుస్తుతి.

ధరకన్నడదేశంబున వరపురంభాపురిమఠమునందువాంఛదలిర్పఁ
విరివిగసింహాసనమున బరగెడు శ్రీరేణుకేను ప్రార్థనజేతుఁ పూర్వ
జంగమపుణ్యాగురుతలతుఁ ధరనుత్తర జంగమగురుల, కాదిగురుడై
పరమదారుకలింగ, గుర్వగ్రజునిదలతుఁ ప్రార్థనజేతుఁ పూర్వజంగ
మ, పుణ్యాగుః దలతుఁ॥ 8

4 విద్యాగురుస్తుతిః, చుట్టుకందార్థము.

ధరధర్మవరపుకులజుని సరసునిశ్రీయమ్మిరాజు, సద్బ్రహ్మఋషిఁ
వరకురవివేంకటశ్రీ నరసింహాసుశాస్త్రులనునెపుడు నామదిదలతుఁ
విద్యాగురులవినుతియొనరింతుఁ సరపజంద్యాలకుల సంజాతశ్రీశీతా
వరరామశాస్త్రులను వాంఛభజియించెద ధరశ్రీజొన్నలగడ్డ వరరా
మకృష్ణశాస్త్రి శరణుజేసెద కాశీనాధ పరమరాజలింగశాస్త్రికి నామ
దిదలతుఁ॥ 9

5 తారకగురుస్తుతి, చుట్టుకందార్థము.

పరశివతారకమన్త్రము సురుచిరముపదేశమొసగి సూటిదలి
ర్పఁ వరపంచముద్రభావము విరివిగదెల్పినలక్ష్మీదేవిని నుతియింతుఁ
మజ్జనసీమాతనువినుతాత్మఁ కరమర్థిఁశ్రీపొన్నకంటి రామలింగ
చరమూర్తిధార్ఙంగిమై సరసతచెలగియు కురవివెంకటనారసింహా
గురునకు ప్రియశిష్యురాలవై పరమహంసైజెలగినట్టి పడతిరత్నము
నెపుడుదలతుఁ। 10

6 వేద-సాంఖ్యామనస్కగురుస్తుతిః.

కరుణఁ సాంఖ్యసుసూచన కరమర్థిని జేసినట్టి ఘనసుచరిత్రుఁ
ధరపొన్నకంటితాతయ గురుమూర్తులనెపుడునేను గొనియాడుచుం
దుఁ గురుడేబ్రహ్మమని నమ్మియుందుఁ కరుణచేస్వరసహిత ఘనవే

దాధ్యాయనమును పఠించిచెప్పిన గురువరునియెప్పుడు గొనియాడు చుండుఁడీ॥ 11

7 శివాద్వైతగురుస్తుతిః, చుట్టుకందార్థము.

బసవద్వాదశిమన్త్రి నసదృశమత్కర్ణమందు నతిసుకృపచే నసమంబౌయుపదేశము నొసగినవిడియాలవంశజు నొనరనుతిజేతుఁడ వరమస్మత్సద్గురునినర్చింతుఁడ అసమలింగాంగసంబంధార్చనవిధము విసుకదెలిపినవీరమాంబనాథుఁడ కుసుమాయుధవైరినిభుడగు గురుశేఖరనీలకంఠ వరయల్లమందేశ్వర పరమశిష్యునెప్పుడు దలతుఁడ॥ 12

8 పరిపూర్ణబోధాగురుస్తుతిః, చుట్టుకందార్థయ.

ధరవిశ్వబ్రహ్మకులజుని సరసుపర్ణసగోత్ర సంభవుననఘుఁడ నరవిశ్వజ్ఞసుసూనృతుని కరమరుదుగ ప్రణవశాఖ కలితునిఘనుని మడుపువంశమణి సంభవుని సురుచిశేషమాంబకు శోభనాద్యాచార్లకు నరయపుత్రుని యచ్చమాంబకునాథుని మరియునుగోవిందమాంబకు మాన్యవిశ్వజ్ఞానచారికి సరసజనకుండయ్యు వెలసిన పరమసుబ్బయాచార్యగొల్తుఁడ॥ కలితునిఘనుని॥ 13

పిండబ్రహ్మాండంబుల దండివిచారణంబు దయచేదెలిపి మెండగు సందేహంబుల ఖండితమొనరించినట్టి ఘనగురువర్యుఁడ మడుపుసుబ్బయాచార్యగొలుతుఁడ పిండబ్రహ్మాండముల రెండింటిలోనిండి పరిపూర్ణంబును త్తదనిదెలిపిన ఘనగురువర్యుఁడ మడుపుసుబ్బయాచార్యగొల్తుఁడ॥ 14

చుట్టుకందార్థము.

ధరమడుపుబ్బయాచార్యులు కరమరుదుగనన్ను గాంచి కరుణఁడ బళిరెఁడ వరపానుగంటి కోటీశ్వరశాస్త్రివినుమియొకటి వరుసరంజిల్ల దెలిపెదనింకమనముశోభిల్ల పరగనాశిష్యుడౌ పణిదెంనాగలింగయ సరసుడువ్రాశిన పరమహంసప్రశ్నల్ కరమర్థినిజేయుమిప్పుడు కందార్థదరువులుగ పరమజ్ఞానులకెల్లజగమున పారనీయ్యంబగునునిజముగ వరుసరంజిల్ల॥ 15

చుట్టుకందార్ధము.

మఱి శాస్త్రిలునగువారికి సురుచిరజ్ఞానానుభవము జూడగసున్నా యరయగననుభవపరులకు విరివిగ శాస్త్రానుభవము వినుమయ్యాసున్నా యీ రెండున్న కవిత్వంబుమన్నా పరికింపనీమూడు బాగుగలిగియున్న యరయనమృతవాక్కు లమరుట లేదన్నా సరసుడాయివియన్ని నీకు సత్పూర్వపుణ్యవశమున పరగహరుకృపగలిగెగావున బలుకుమీ గ్రంథంబ నెనూ వినుమయ్యాసున్నా యీ రెండున్న కవిత్వంబుమన్నా ॥16

చుట్టుకందార్ధము.

ఏతద్గ్రంథస్తోత్సాహ కర్తవంశావళి.

గురు మడుపుసుబ్బయార్యుల పరమాజ్ఞన్ హంససూత్ర ప్రశ్నోత్తరముల్ వరశిష్యుడయ్యు బలికిన ధరపణిదెము వంశజుండు ధన్యాత్ముడు ఘనుడు సద్భృంగిగోత్ర సంభవుడనఘుండు మరిదారుక సూత్రుండు, మ ప్రణవశాఖయు నరయపతివ్రతమహా లక్ష్మాంబకు బుచ్చయకు పరమపుత్రుడు కోటమాంబకు పతియుమేల్ పరిపూర్ణ చంద్ర పరమలింగ జనకుడిట్టల బలికె నాగలింగదేవర ధన్యాత్ముడు ఘనుడూ సద్భృంగిగోత్రిసంభవుడనఘుండు. 17

విను కోటీశ్వరశాస్త్రి మనమొకకులమందుబుట్టి మరిబంధుత్వం బుననొక నూరునబెరిగియు మనమొక బడిలోనజదివి మనమొక్క కురపి వెంకట నరహరిశాస్త్రిని ధీవి మనమలర శేవించి మరిశాస్త్రంబును జదివి మనమొక్క వేదాన్తఘనమార్గమందున బనిబడి జెలగితిమిగాన, బాగ నేబల్కినహంస ఘనప్రశ్నల హంసతత్వాకందార్ధాల్ జేయుమనెను మనమొక్కకురవి. 18

వర రేణుకగురుపీఠము బరువడినర్పించుచుండి భక్తిదలిర్పన్ సరస తతత్మ్గుగు పేరన్ తిరమగు గ్రంథములబల్కి దేశికులౌననగా ననుభవపరులు సంతసమందంగా పరమశివాద్వైత పద్ధతులనునెల్ల పరిపరివిధముల బల్కుచునుంటివి దేశికులౌననగా ననుభవపరులు సంతసమందంగా. 19

## 11 చుట్టుకందార్థము.

### ఏతద్గ్రంథకారక కవీశ్వరవంశావళి.

శ్రీ పానుగంటి నాగమ దీక్షిత శ్రీ లింగమూర్తి దివ్యసుతుం
డగు మేల్పుమధనంది గోత్రుడ నేపండిత రేణకేశ నిజసూత్రియు
తుడ జంగమ కోటిలింగయాఖ్యుండ నేపలర సోమాంబకు నెంచగా
నాధుండ ప్రాపు రేణకదారుక బాలకజనకుండ నాప్రమధ రేణుకగురు
నకు నరయగా శిష్యుండనై తిని పాపరహిత శివయోగుల పాద శేవ
కుండనెప్పుడు నిజసూత్రయుతుడు జంగమ కోటిలింగయాఖ్యుండ. 20

గురు మడుపు సుబ్బయార్యుల కపమాజ్ఞాను హంసతత్వ
కందార్ధంబుల్ తిరముగ రచియించితినే కరుణించియు దీనిమీరు
కనుగొనుడయ్యా గురుశిష్య సంవాదం బిదియయ్యా పొరపాటులుం
డిన పోసగదిద్దుడు మీరు పొరపాటుబడి దీని పొరపాటాయన దగదు
గనుగొనుడయ్యా గురుశిష్య సంవాదం బిదియయ్యా. 21

వినుడీ గ్రంథములోనగ ఘనమగు రహస్యములు గలవు
గాఫున వానిగ మునుకొని గురువులు శిష్యులు బనిబడి జదివియును
వాని బల్యానుభవముల తనువునందే గనుపెట్టుడుచాలా వినకగనక వాని
వివరింపనేరక వినుడీ చులకన పలుకులనగా ననుభవపరుల బల్యాను
భవముల తనువునందే గనుపెట్టుడుచాల. 22

ఓం తత్సత్.

---

ఓం సద్గురు పరబ్రహ్మణేనమః

### హంసవిచారణ

పదిరెండువత్సరంబులు సదమలగురు శేవజేసి, సద్గురు కరుణగ
ముదమొదవహంసబోధను విదితంబుగవినగగోరి విరివిశిష్యుండు నిట్లని
బలికె వినుతసుగుణుండు సదయహృదయగురుడ సకలదేహములందు
పొదలుహంసస్రుష్టి పొందుగదెల్పుమనె విరివిశిష్యుండు॥ 23

వరపవిత్ర్యగాత్మకళయదా పరమ హాకారంబులెన్న పరికింపంగన్
విరివిగప్రకృతికళయదా సరససకారంబునిదియు స్థిరమతివినుమా సత్యం
బిదియర వేదుగనుమా పరగనీరెండునుపరికించి చూడంగ వరబిందువు
తోఁజేరి బరగెహంసయనగ స్థిరమతివినుమా సత్యంబిది యరలేదు
గనుమా॥ 24

గురువర్యహంసయెచ్చట పరగంగాసృష్టియగునో భావంబలరన్
కరమగుదుగనాస్థానము పరికించియు దెల్పుమయ్యా పండితవర్యా
యీసందేహము దీర్పుమాయయ్యా విరివిగ సీరీతివేడుకొనగనపుడు
పరమగురుడు బలికె భక్తిచే వినుమనుచుపండితవర్యా యీసందేహ
ము దీర్పుమాయయ్యా॥ 25

తెలిపెదవినుమాహంసయు దలపగతనునందు నష్టతనువులలో
పలిదేశమందుబుట్టును బలువగురహస్యంబుదీని భక్తితోనీవు దెలియు
మిట్లు కలుషంబుబోవు బలికితినీభక్తిప్రాభవమునుమెచ్చి సలలితంబుగ
నిదిసత్యమనినమ్ము భక్తితోనీవు దెలియుమిట్లు కలుషంబుబోవు। 26

వినుదేశికవర్య యీ మునినుతమైనట్టి హంస ముదముదలిర్పన్
తనువులమధ్యంబుననే దనతావున నుండలేక దానెచటైనన్ జనునో
గనగా ఘనులురంజిలగన్ మనముల్లసిల దెలిపి మమ్ములరక్షించి ఘనకృ
పగాంచుమి గాచియుంటిమయ్యా దానెచటైనన్ జనునోగనగా ఘను
లురంజిలగన్॥ 27

బాలకవినుమాహంసయె లాలితదేహములమధ్య మేలుదలిర్పన్
వాలాయంబుగనుండును చాలుగనాహంసకళయె సకలనాడులలో నిండి
యెపుడు దండినడినాడిల్ నెలవైనాడులద్వారా నెమ్మిదేహంబంత గలసి
కమ్మియుండు గనిపరీక్షింపుము సకలనాడులలో నిండియెపుడు దండినడి
నాడిల్। 28

దీపితనాడులనన్నిటి వ్యాపించియుహంసయెన్ని, వ్యాపారంబుల్
ప్రాపుగజేయునో దెల్పుడు నాపాపములెల్లబోవ, నాగురువర్యా కాపా

దుము ఘనగుణధుర్యా నీపనియిదిజూడ, నీసేవజేయుటయె నాపనియిదె
యయ్యా, పాపసంహారుడ నాగురువర్య కాపాడుముఘనగుణధుర్యా॥29
తనయూదెలిపెదవినరా తనువందునహంసజూడ తథ్యంబొప్పన్
మనమలరమూడువిధముల పనులనునొనరించుచుండు, భక్తవినుమయ్యా
యిదిగురుమర్మమెంచగనవయ్యా అనివచియించెడి, యాసద్గురునిగాంచి
ఘనపాదంబులబట్టి, కడుశిష్యుడిట్లనియె భక్తివినుమయ్యా, యిదిగురు
మర్మమెంచగనవయ్యా॥ 30
గురుడాహంసయుజేసెడి కరమర్థినిమూడుపనులు, గననేమిటివో
విరివిగతత్త్వానంబుల కరుణన్నెలవొసగుమింక, ఘనుడవుజియ్యా యిది
యేలనని, యెంచబోకయ్యా ధరణిగురు తల్లి, దండ్రియనువాక్యము,
మరువకనిన్నెపుడు, మరిమరిగొల్తుము ఘనుడవుజియ్యా యిదియేలనని
యెంచబోకయ్యా॥ 31
వినుశిష్యకమలమధ్యను ననయము జపియించుటయును హంస
గనంగన్ ఘనతరఘంటికయందలి మనమలరగనడచుటయును, మాన్య
చారిత్రా ఆజ్ఞేయమున, నమలసుపుత్రా ఘనతవ్యాపారంబు గావింపు
చుండుటగనగ నివియెమూడుపనులుజేయుచునుండు మాన్యచారిత్రా
ఆజ్ఞేయమున నమలసుపుత్రా॥ 32
కమలంబనగానేమిటి విమలాత్మదెల్పుమయ్యా విరివిగనెచటో
క్రమముగఘంటికయెచ్చటో సుఖదాయాజ్ఞేయమనగ చూడనెచ్చటనో
దెల్పుమయ్యాజాడవిందునో నెమ్మదియీబోధనేర్పుతో మాకొక సమ్మతి
దెల్పుడు సర్వాధికారులు జూడనెచ్చటనో దెల్పుమయ్యాజాడవిందునూ
వినుమాకమలంబనగా ఘనసహస్రారకమల కడుసౌజ్ఞయగున్
ఘనదేశంబనభూధర మునకును మధ్యప్రదేశమున వెలయుచుండున్
సీతాపుననే నెమ్మివసియించున్ మొనసిపరిత్యక్తత్వాకునకు దళముల
కును దనరుమధ్యవకాశమె, స్థానంబనగజెల్లు మన వెలయుచుండున్
సీతాపుననె నెమ్మివసియించున్। 34

వరప్రియశిష్యావినుమా గురుతరఘంటికయనంగ గొప్పగుము డియూ మరి నాళ్లు బుట్టుస్థానము పరికింపగనిది యెఱుగుము భావమలరంగా నెక్కడ ననగా నెలమివినుబాగా దరమొప్పగానష్టతనువులకునడుమపరగప్రాగీశాన్యపు ఇరు రేకులమధ్య భావమలరంగా నెక్కడననగా నెలమివినుబాగా॥ 35

సరసిజసంభవుడదిగ కరమిరుమగజెలగుపంచ, కర్తలకెపుడుణ వరపంచశక్తిసతులకు సరసంబుగనాజ్ఞ జెల్లుస్థలముగావున ఆజ్ఞేయమని యనబడెనుజాణ సరసుడ వ్యవహార స్థానంబనగనిదియె పరగద్విదళమధ్యబాగుగవినుమయ్యా స్థళముగావున ఆజ్ఞేయమనియనబడెనుజాణ॥ 36

హరహరివిధినుత దేశిక కరములు ముకుళింతునీకు కడువినయముచే మరిదెల్పుమియూహంసయు వరజపమే మంత్రింబుచేత కరమర్థి జేయు శ్రద్ధగదెల్పుసంశయముబాయు విరివిగవినుమోయి వేట్కచే దెలిపెద పరమరామమంత్రి వరజపంబొనరించు కరమర్థిజేయు శ్రద్ధగ దెల్పు సంశయముబాయూ॥ 37

స్వామిశ్రీసద్గురువర రామయనంబరగుమన్త్రి, రాజముగనగా నేమన్త్రిపుసంబంధమెు నామనవిని వినియుదెల్పు నాగురువర్యా వందనమిదె, సాధుగుణగురువర్యా యీామానులకునైన, భూమీశులకునైన, నేమిదెలియగరా దెంచగురుడు లేక నాగురువర్యా వందనమిదెసాధుగుణధుర్యా॥ 38

వరచతురక్షరిలోపల బరగు రకారంబుపరమ పంచాక్షరిలోవరలుమకారంబునుగన తిరముగగలుపంగ రెండు దెలియరమయయ్యో యది మన్త్రింబని, యనబడదయ్యో విరివిగరమయనెడి వేడ్క రెండక్షరాల్ వరబిందురూపమగు పరమదీర్ఘముజేరి, రామయదియయ్యో యదిమన్త్రిమని యనబడ్డదయ్యో॥ 39

స్థిరమతియీామన్త్రంబిల పరప్రకృతీపురుషసం, బంధంబనగా ధర వెలయుమోక్షప్రదమై పరికింపగసురలుదీని పఠియించిరెన్నా గిరి

సుతదీని జపియించునన్నా పరమయతులు సురలు పన్నగేశ్వరులెల్ల నరులును జపియించి పరమహంసలైరి పఠియించిరెన్నా గిరిసుతదీని జపియించునన్నా॥ 40

గురురాయహంసగసగా బరువడి జలజంబుమధ్య బరగుటయే లన్ విరివిగ దెల్పుమియనగా కిరుణన్ శిష్యునిగాంచి గురుదేవుడనియెన్ బ్రహ్మకుతావు పద్మంబుగానన్ వరుసగ బ్రహ్మకు వాహనంబగుహంస వరబ్రహ్మనిలయమున వాంఛచేజెలగును గురుదేవుడనియెన్ బ్రహ్మకుతావు పద్మంబుగానన్॥ 41

గనసత్యలోకమందున బనిబడివసియించుబ్రహ్మ పద్మమునదు మన్ మునుకొనియేహేతువుచే, ననయము వసియింపుచుండు నదిదెల్పుస్వామీ దెల్పకపోదు సందియముసుమీ॥ యనఘావినరసాహ, సారించక్రముజూడ యెన్నాయేడనదగుట నదెసత్యలోకంబు నదిదెల్పుస్వామీ దెలుపకబోదు సంశయముసుమీ॥ 42

చుట్టుకందార్థము.

ముచ్చటలలరగ దేశిక యెచ్చోటుల హంసజెలగి యేయేపేర్లన్ యిచ్చన్బొందెనో చెల్పుమి సచ్చరితాయనగనపుడు సద్గురుడనియెన్ శిష్యునిమెచ్చిజెప్పగదొడిగె నచ్చభువనజమధ్యనచలహంసయయ్యె స్వచ్ఛఘంటికయందు నిచ్ఛగు కలహంస కచ్చితంబుగనయ్యెజెలగెను, కరుణమీరగజెప్పితినివిను హెచ్చుగానాజ్ఞేయమందున నెంచ జీవహంసయయ్యె సద్గురుండనియెన్॥ 43

గన జపముజేయుహంసయె వినుతంబాయచలహంస, యనబడు నెట్లా మునినుతదెల్పుమియనగా దనశిష్యునితోడబల్కె, దగగురుండిట్లు సంశయమపుడే యెడబాయునట్లు నానాప్రపంచచల నాదులు లెపుగాన దనరెసరసిజమధ్య ఘనయచలహంసయన॥ దగగురుడిట్లు సంశయమపుడ యెడబాయునట్లూ॥ 44

## చుట్టుకందార్థములు.

వినుమాహంసకుగురువర మునుకొనగాపక్షి నామమొనసెట్లి డిరో మనమలర దెల్పుమనగా వినుతగుణాఢ్యుండుగురుడు వినియునిట్ల నియె శిష్యాప్రశ్న గనగమేలనియె గన పాలునీరువలె గలశియున్న యట్టి ఘనజ్ఞానాజ్ఞానముల గాంచియజ్ఞానమనె మొనసివెలసెడియుదక మునుదా గనియువిడచియు జ్ఞానక్షీరము జననుతంబుగగ్రోలుగావున జగతిహంసయెపక్షియనబడె॥ వినియు నిట్లనియె॥ 45

గురురత్నమ యీ హంసకు కిరమరుదుగ నెంచిగాంచ, ఘంటి కయందుఁ ధర కలహంస నునామము పరికింపగ నెట్లుకలిగె పలుకు మోదేవా సంశయమెల్ల దరుగుసుభావా పరమపుత్రా వినుమి య రయఘంటిక యనఁగా సరసజ్ఞానాజ్ఞాన స్థలమగును గాంబట్టి పరగ నజ్ఞానంబు వదలియు పరమ సుజ్ఞానంబు బూనుట సరససాంఖ్యు లెల్ల ఘంటిక స్థలమును, కలహంస కనిరి పలుకుమో దేవా సంశయమెల్లదరుగుసుభావా. 46

జనకా సహస్రారంబున, ననయము వసియించునచల హంస కుగనగ మునుకొని ఘంటికయందలి జననుత కలహంసయనెడి, ఘననామమెట్లు గలిగెనో దెల్పు సంశయమిడునట్టు వినుమీ శిష్యా యికను వివరించి దెలిపెద మొనసిస్థానభేద మునబిందుపుతో జేరి యొనరగా నెల్లపుడుజేయు వృత్తిభేదములచేత, ఘనతరంబుగ కల హంస యనెడి నామంబిడిరి సాంఖ్యులు. 47

ఘనుడాయాజ్ఞేయంబున గనుగొనగా జీవహంస యనబడు టెట్లో మనమలరగ దెల్పుడియన, విని దేశికు డిట్లనియె శిష్య, వీరు నిగాంచీ తనయు డడుగుటకు సంతసించీ ఘనప్రాణవాయువుతో గలసి జీవభావమును బొంది వ్యవహారమును సల్పు గావున ఘనతరం బుగ జీవహంస యనెడి నామము గలిగె నిజముగ మునులజ్ఞానుల యనుభవంబిదె యనుచు నమ్మియుండ జెల్లును వీరుని గాంచీ. 48

తనువందు జెలగు హంసను ననువుగ జీవుండటంచు, హంసయు టంచుర్ మునులును బల్కిరి యెట్లది వినుపింపుమటన్న గురుడు వేడుక బలికెర్ వినుమో శిష్యాయని జెప్పదొడగెర్ ఘనదేహేంద్రి యాళిర్ గలసి వ్యాపారముల నొనరించుచు పుణ్యమును పాపమును గనగ ననుభవించు చున్నదగుటర్ హంసను జీవుండనిరి వినుమి హంస వరమింకవి వినుపింతు ననుభవంబిది వేడుక బలికెర్. **49**

వింతగు తనువున జెలగెడి యంతర్సుషుమ్న నుండియటుచీలిన వెలికంతో బాహ్యసుషుమ్నన మంతనమున జెలగునట్టి మరిచంద్రసూర్య నాడులద్వారానటియింపుచయ్యా యంతటికినేనే యనుచువ్యవహారము ల వింతగ జెలగుటవెలసె హంసయనగ మరి చంద్రసూర్య నాడులద్వా రానటియింపుచయ్యా॥ **50**

గురువర్య శరణుజేసెద నరయంగా జీవునకును, హంసకు గన గర్ వరరూపమొకటియేనా పరికింపగ భేదమున్న బలుకుమోస్వామీ నిన్నేనమ్మియుంటిమిసుమీ వరశిష్యాయిరువురకు మరిభేదమేమిలేదు బరువడిరూపంబు బాగనొకటియెగాని యరుదుగానాహంసస త్తయె బరువడి గుణములనువృత్తుల జేరగా జీవుండనియెడి పేరుగలిగెను వస్తు వొక్కటె బలుకుమోస్వామీ॥ **51**

ఘనదేశికులీహంసకు తనువున నెచ్చోట్లనేయె, దగుపేర్లిడిరో యనగను గురువరుడిట్లనె తనయాదెల్పెదనువినుమి దాచనింకేల నమ్మి నశిష్యుడవునీవెచాలా వినుమిజ్ఞాతసాక్షి వివరింపహంసయన ఘనప్రణవ ముప్రజ్ఞాన మనిన తెలివిలింగమనినప్రత్యగ్జ్యోతికళ యనిన గురుండెరుక నేనన వినుమియూహాజ్ఞప్తి బ్రహ్మము జనునుహంసకు మరుగుబేరులు దాచనింకేల నమ్మినశిష్యుడవునీవెచాలా॥ **52**

వినుమయ్యదేశికేంద్రా గనగానాహంసయాజ్ఞ క్రమలంబందుర్ పనిబడినిలచియునేనని ఘనవ్యవహారములు సల్పుకారణమేమి యనియ డిగినశిష్యునిగని సూనుడ ప్రపంచసృష్టికొరకు హంసమానస పవనముల

మరిగలసిమెలగుచు నేనునేనని సర్వమునూదా మానితంబుగ జేయునెప్పు
డు నేననగా నెవరోదెల్పెదగాని తత్స్థానముననిల్పుము॥ కారణమేమి యని
యడిగిన శిష్యునిగని॥ 53

నేననగా నేమిటిదో నేనను రెండక్షరములు నెటుబుట్టెనన౯
మానిత గురువరుడిట్లనె భూనుత హకార సకారంబులు రెండుగూడ౯
మానితాజ్ఞ స్థానమున జేర౯ నేనయ్యెవ్యవహారమేవృత్తిలేకపోగా
మాన్యహకారమునకు మరిసకారంబునకు బూనివృత్తిని గలుగజేసిన
మానితంబే బిందువ్రుండెను ధీనుతాబైందవపోగ్లను బూనినేనని వ్యవహ
రించెను బులురెండుగూడ౯ మానితాజ్ఞ స్థానమున జేరె౯॥ 54

మంత్రంబందలిదీర్ఘము సంతతమును నడకయంగు సద్బిందువు
యగు౯ వింతగువ్యవహారంబున మంతనమునపోల్లటంచుమరిజెప్పనేల నని
త్రివిధముగా ననబడుటేలా మునుకొనియామూడు మూడుసంబంధము
లో మొనసిలేకనొకటో ముఖ్యదెల్పుమనగ వినుమిశిష్యాయీమూడు
గనగనొక్కసంబంధమె గానిరెండుసంబంధాల్ గానేరవెన్నటికి॥ నని త్రి
విధముగ॥ 55

శ్రీకరచరణాదేశిక ప్రాకటముగనొక్కసం, బంధంబైతే జో
క౯ త్రివిధపుపేర్లుగ నేకరణి౯ జెప్పుటొప్పు నెంచిచూడగను జెప్పిన
నెవ్వరొప్పుదురిలను ప్రాకటయశుడయిది, బాగుగదెల్పుమి మీకటా
క్షమునకు, మేమహులలముగామా యెంచిచూడగను జెప్పిననెవ్వరొ
ప్పుదురిలనూ॥ 56

చుట్టుకందార్థము.

తనయావినుమిక దెలిపెద మునికొనిదీర్ఘంబుదీసి, కొనకనె
యుండ౯ ఘనమాత్రము లేదయ్యెను గనుకనె దీర్ఘంబటంచు, వైకొం
దురన్నా బిందువునింకగ్రహింపకున్నా ఘనముగునడకయే కడుశూన్య
మైజనును గనుకనె బిందువును, గ్రహించితిమిపుడు వినుమిపోల్లనుదీసి

కానకు నీడునువ్యవహారమెల్లను గనుకపొర్లులును గైకొంటిమి గాన
నొకటియె త్రివిధమయ్యె గైకొందురన్నా॥ 57

సరసుడత్రిస్థానంబుల పరికింపగనొక్క హంసె, బరగుటదె
కరుణ దెల్పుమియనగా గురువరుడిట్లనగబూనె గురుతరంబుగ శిష్యుని
గనిసెబాసనంగా నరయగవినుమోయి యవయవభేదముల పరమ
త్రిస్థానముల బరగునెప్పుడుహంస గురుతరంబుగ శిష్యునిగని సెబా
సనంగా॥ 58

చుట్టుకందార్ధములు.

వరుస దెల్పుమిస్వామీ బరువడియవయవములనగ బడునవి
యేవో పరికించుమనగ గురుడనె సరసత వినుశిష్యహంస, వరము
ఖ్యాంగములు శిరముకాళ్ళు నరయబలురెక్కల్ గురురాయ యవయ
వాల్ కోరియెచ్చటనుండు సరసతెల్పుమన పరమగురుండనియె
బరువడిదళములకుమధ్యను శిరముజెలగును ఘంటినడుమను చరణ
ములు నాజ్ఞేయమంకున వరుసరెండురెక్కలుండు వరముఖ్యాం
గములు॥ 59

ఘనగురునర ఇట్లుండుట కునుకారణమేమియనగ, గురువరుడ
నియె తనయా జపమును జేయుట ఘనవాగింద్రియముచేత గానవా
వాక్కు శిరముననుండె సేవ్యమైపెక్కు గనుక హంసశిరస్సు దనరుదళ
ములమధ్య వినుమిచరణద్వారా విమలనానడకలు గనుకనేచరణములు
ఘంటిక ననుపుగా వెలయుచునుండెను మనమురంజిల విసరురెక్కలు
గనగనాజ్ఞాచక్రమందు మొనసియున్నవిగనుక జపము గనగ నడక
వ్యాపారాల్ వినుతసుగుణాకారణంబై వెలసెనివ్విధి వెలియుమోయి
గానవాక్కు॥ 60

గురురాయయొక్క-హంసయె బరునడిత్రిస్థానములను బలుత్రివి
ధముగా బరగుటదేలననంగా గురువరుడిట్లనెనుశిష్య గుణతతకిమెచ్చి
తగినశిష్యుడని ముదము హెచ్చి పరమగిరినడుమన వరజపముజేయు

తమ తరియించుటకుగాను దనరె నచ్చుటహంస పరమఘంటికయందు జెలగుట బరువడిజ్ఞానాజ్ఞాన వరవిచక్షణకొరకునాజ్ఞన బరగెజాగ్రత్స్వప్తికొరకు॥ గుణతతికిమెచ్చి॥ 61

సలలిత సుగుణా గురువర దెలుపుమి యీదివ్యహంస త్రిస్థానములన్ మెలగునె గనగా నేయెయె బడువగు స్వరూపస్వభావములతోడ దెలుపు మనగ గురుడనియెజూడ దలమెట్టనాహంస బలుజ్ఞానరూపముతో సలలితమోక్షమును సరసన్ గోరుచుండు లలితఘంటికయందుగనగా బలుజ్ఞానాజ్ఞానములతో చెలగును విభాజ్యభావములనుగైకొనియున్నందున జెలగునాజ్ఞాయందు జీవచలనభావముచేతమిక్కిలి॥62

గురురాయ యిట్టిహంసను బరువడివిచారింప ఫలమేమిటిదో తిరముగ దెలుపుమి యనగా గురువరు డిట్లనియె శిష్య గోప్యమిది మంచి యగమరవీడి దెలిపెదమించీ సరసయీహంసను సాంగంబుగా భక్తి పరమశ్రద్ధలచేత, బాగవిచారించ నరయుబోవును దేహేంద్రియాదిసంబంధంబులైన పరమపాపసంసారపు బలుహింసలు శిష్యవర్యా గోప్యమిదిమంచి॥ 63

వరదీర్ఘబిందుపొల్లులు సరసత నివియొక్కవస్తు సంబంధములై బరగిన నొకకార్యంబె కరమరుదుగ జేయవలయు, గాని యీ మూడు మూడుపనులగన నెట్లుజేయు పరమశిష్యా వినుమి, పరికింపనామూడు సరసత నొకవస్తుసంబాధంబైనను పరగస్థానభేదములచే, గరిమవృత్తి భేదించియు నరయగా దేనికార్యం బదియె నాచరించుచుండూ॥ 64

గురుశేఖర దీర్ఘంబును పరికింపగ బిందువరయ బాగుగ పొల్లున్ కరమరుదుగ నీమూడును సరసతగన నొక్కవస్తుసంబంధంబైనన్ గురుతేమిటి యెరిగింపుమనినన్ గురుడిట్లని వచియించె, పరమ శిష్యా వినుమి, యొరులకు తరమగునె సరసనిట్లడుగుట సంబంధమైనన్ గురుతేమిటి యెరిగింపుమనినన్॥ 65

ధామయనే రెండక్షరముల ప్రేమనూచింపుచుండె పెనువృగ

కారం ధీమతి మరి హంసయనే యిమ్మగ రెండక్షరముల నిరువుగ
మించీ అకారంబె సూచించె మించీ నమ్మమందువలన, సుమ్మకార
సాంజ్ఞ నెమ్మియూర్ధ్వస్థలినె యొంచిచూపుచునుండు సమ్మతి గానం
దువలన సరసనూర్ధ్వస్థలి నిలచిన కమ్మని ప్రత్యగాత్మనునెమ్మి
నేనని సూచించు నిరువుగ మించీ అకారంబె సూచించె మించీ॥ 66

నేననెడి శబ్దమందున మాసితగుణ మొదటిదియైన మరి, నేయం
దున ధీనుత ఈకారంబును భూనుత రెండవది యయ్యుపాసగును
యందున జెలగెడు కారంబుగను, గానగను సూనుడ యివి రెండు,
సుచిరంబుగ గలసి గాన ఈవు అయ్యేను బూనియే ఈవు అంటె
యనువుల లరనే ప్రత్య గాత్మసంబంధంబున్నదో మునుకొని ఆ, ఈ
వుగాన మూడు నొక్క ప్రత్యగాత్మను యందున జెలగెడుకారంబు
గనుగొనగను॥ 67

గురుశేఖర యీహంసయు సురుచిర బాహ్యాంతరస్థ సుషుమ్నల
యందున పరికింపనెట్లు దిరుగునో కరుణించియు దెల్పుడనగా గురు
రాయుడనియే స్థిరమతివినుమీ జెప్పెదననియే వరుసమీర ప్రాణవా
యురూపముగాను తిరముగ సూషుమ్నల దిరుగుచునుండును గురురా
యుడనియే స్థిరమతివినుమి జెప్పెదననియే॥ 68

గురువరుడ ప్రాణవాయువు వరహృదయస్థానమందు వసియించు
గదా యరయను ఘంటికయందలి కరమరుదుగ జెలగుహంసను గలశిదా
నెట్లు జీవహంస యనబడుటెట్లు పరికించి దెల్పుమి పరమదేశికయనగ
గురుమూర్తియిట్లనియె సరసశిష్యునిగాంచి గలసిదానెట్లు జీవహంస
యనబడుటెట్లు॥ 69

చుట్టుకందార్థము

మంతనమున దెల్పెదవిను మంతరయిడపింగళాఖ్య యనబడునా
డుల్ సంతతతనుమధ్యంబున వింతగుస్తంభంబువలెను వెలుగొందుచు
న్న బ్రహ్మాదండికి కుడియెడమలనన్నా యెంతో వింతగనుండి వెలసిహ్మా

దయమువరకు నంతటవ్యాపించి యక్కడనున్నట్టి వింతప్రాణవాయు
వును వేగమెతీసికొనియు సంతసముఘంటికయందలి సరసహంసనుగలశి
యనుభవ్యా యంతరంబున జేరెగాపున. నవనిజీవహంసయయ్యె వెలుగొం
దుచున్నా బ్రహ్మాదండికి కుడియెడమలనన్నా॥ 70

చక్కనియంతర్సుషుమ్నయు నెక్కడదాబుట్టిప్రబలి యెంతటి
వరకుర్ మక్కువజెలగి సుషుమ్నని చక్కనినామంబుబొందియెక్కడ
నుంచీ యెట్లుజీలె యక్కజముమించీ యెక్కడకు వ్యాపించియెంచ నిడ
పింగళలై యక్కజముగజెలగె నంతయుదెల్పుమి యెక్కడనుంచి॥ 71

చుట్టుకందార్థము.

తనయాదెల్పెదవినరా ఘనఘంటికయంనుబుట్టి కడుసుషుమ్నర
యర్ తనుమస్యధోభాగముగా గనుగొనగాస్థిరినాలు కానరకువచ్చి
యంతర్సుషుమ్నయనుపేరర్ హెచ్చి అనుమానమేలర యక్కడనుండి
యు వినురెండుగాజీలి ఘనయీడాపింగళ లనెడినామంబులనుబొందియు
ఘనతరహృత్తనలికివచ్చియు తనువందునవ్యాపించెను దాచుకొనురహ
స్యంబుశిష్యా కానరకువచ్చి యంతర్సుషుమ్నయనుపేరర్॥ 72

గురువరబాహ్యాసుషుమ్నయు గురుతరముగనెచటబుట్టి కొమరు
దలిర్పర్ పరికింపనెంతవరకును సురుచిరవ్యాపించిబాహ్యా సుషుమ్న
యయ్యెర్ యెక్కడనుండి యెలమితోచీలెర్ బరగియెంతవరకు బాహ్యా
యిడపింగళ పరమనామంబుల బాగుగజెందెనో సుషుమ్నయయ్యెర్
యెక్కడనుండి యెలమితోచీలెర్॥ 73

అరయర్ బాహ్యాసుషుమ్నయు వరఘంటికయందుబుట్టి వాం
ఛదలిర్పర్ బరువడియాజ్ఞేయంబుకు సురుచిరముగవచ్చి బాహ్యాసుషు
మ్నయయ్యు నాజ్ఞేయమందే రెండుగానయ్యు బెరగిబాహ్యాయిడ,
పింగళలనబడియు వరనాసికమార్గముమైవచ్చి వెలుపలజెలగే సుషు
మ్నయయ్యు॥ 74

చుట్టుకందార్థము.

గురువరయొక్క సుషుమ్నకె బరువడియంతర్సుషుమ్నా బాహ్యాసుషుమ్నా వరసౌజ్ఞలెట్లుగలిగను కరుణంబ్సెలవొసగుమనగా గాంచి గురుడనియే శిష్యాయిది కడుగోప్యమనియే పరికింపగానొక్క ప్రాణవాయు వెజూడ పరగంగమేలంతర్బాహ్యసుషుమ్నల నమసగా జేరియు నువెలిలో వ్యాపారములెల్ల జేయుచు బరిఘవిల్లునుగాన రెండు తెరగులై వర్తించునొకటియె గాంచిగురుడనియే॥ 75

వినుమయ్య దేశికోత్తమ యనయము బాహ్యాంతరంబు లందున మెలగే ఘనప్రాణవాయువేయే పనులను జేయుచునుండు పరికించి చూడ దెల్పుమయ్య సంశయముసెడ తనువందు జెలగెడు తగప్రాణవాయువు పనులను దెలియక బలుసాంఖ్యదెట్లగును పరికించిచూడ దెల్పుమయ్య సంశయముసెడ॥ 76

పరికింపప్రాణవాయువు సరససుషుమ్నద్వయమునందు, సమమగునడకల్ ధరసూర్యోదయము మొదలుగ మరలనుసూర్యోదయమువరకు మాన్యతమీరు ఇరువదియొక్కవేలయార్న్నూరు యురుతర హంసలుగ నుచ్ఛ్వాసనిశ్వాస నిరూపంబులుగాను వాంఛదలిర్పంగ బరువడిగనాయాయా బలుక్లేశములందుజూడగ వరితంతెమాదిరిగా, వరుసగ వ్యవహరించు మాన్యతమీరు ఇరువదియొక్కవేలయార్న్నూరు॥ 77

చుట్టుకందార్థములు.

ఆప్రాణవాయువరయగ ప్రాపుగనెన్నాళితోడ బలువుగగలసి వ్యాపారంబులజేయునొ నాపాపములడగదెల్పు మనగాగురుడనియే దెల్పెదనికవిను ముఖ్యమనియే దీపింపహంసకో తేజములనగగూడి యీప్రాణవాయువె యెంచవ్యవహరించు నేపుమీరగప్రాణవాయువేసంబంధంబనగా ప్రాపుగ నకారసంబంధంబని గురుడుబల్కె గురువరుడనియే॥ 78

గురుపరప్రేషనులనుచును వరహఠాంఖులభాషచేత, వచియిం చెదరే కరమరుదుగనవిమెచ్చట బరువడిజెలగుచునుండె బలుకుమో స్వామీ కలుషములడచ కిర్తవ్యుసుమీ పరమశిష్యావినుమ బలుప్రేష నులునెల్ల, పరీకింపగానంత, ర్బాహ్యములనున్నవి బలుకుమోస్వామీ కలుషములడచ, కర్తవ్యుసుమీ॥ 79

వరదేశిక వినుమయ్యా మరియంతర్సుషుమ్నా మార్గమునందుర్ స్థిరమగుప్రేషనులెన్నియొ గురుతరముగ దెల్పుమనగ గురునరుడనియే శిష్యావినుము మరుగుంజమిదియే సురుచిరముగ నంతర్సుషుమ్నామా ర్గమున పరికింపగానై బలువౌప్రేషనులుండె గురుపరుడనియే •శిష్యావినుము మరుగునిజమనియే॥ 80

గురురాయ వినుము మానవిని పరికింపగ బాహ్యసుషుమ్నా బాటనదెలియుర్ గురుతగుప్రేషను లెన్నియొ సరసతనెలవొసగుమనేగా సద్గురుండనియె శిష్యానాకుప్రియసుతుడవనియే సారదిజూడ బాహ్య సుషుమ్నామార్గమున వరమాప్రేష నొకటి బరగె సితనుస్సన సద్గురుడని యే శిష్యానాకు ప్రియసుతుడవనియే॥ 81

చుట్టకందార్థము.

గురుడా యీతనువందున నరయన్ని యోగుప్రేషను, లకంటె మరీ పరికింపనున్న వాయన వరశిష్యునిమదికి నెచ్చి యరపీడియంతర్ గోప్యంబది గురుతుగనుమనియెర్ మరియు వినుమీరెండు మార్గములు గలసియును నరయగ నొకమార్గమైనదానికిపైగా గురుతరంబుగ నొక్క ప్రేషను గోప్యమైరంజిల్లుచుండును పరికింపగ దానిమర్మము గురుశ్రే ష్ఠుండై తెదెలుపును యరపీడియంతర్ గోప్యంబది గురుతుగనుమనియెర్॥

దేవేశ్వరయిదివరకును భావింపగ సుషుమ్న, బాటలటంచుర్ కవిగవచియించితిరే శేవ్యగుణామార్గములకు, చెలగియేనైనా పేర్లున్న వాజెప్పుమీ నానా శేవకసుషుమ్నాశ్రేష్ఠమార్గమునకే భావజ్ఞేడాపిం గళ బాటలనుచునాడీ కవిమార్గముల నెడుపేరులు సినసుంధరగలవుతిర

ముగ సావధానముగాను దెలియుము సరస శిష్యుడవనుచు దెలిపితి॥
చెలగియేవైనా॥ 83

ఒక్కటియగుమార్గమునకె యక్కజముగ నిన్ని పేరు లలరుట
యెట్లా చక్కగవాక్రుచ్చుడియన మక్కువమీరంగగురుడు మాటాడ
దొడగె శిష్యుడు బుద్ధిశాలియనియెరిగె మిక్కిలిరహస్యములు మేము
వివరింతుము చక్కగవానిని శ్రవణాదులను నింగపు మాటాడదొడగె
శిష్యుడుబుద్ధిశాలియనియెరిగె॥ 84

వినుమిడనాడియనంగా జననుత యాసూర్యనాడిజను పేరరయన్
ఘనపింగళనాడియన మనమలరగచంద్రనాడి మాన్యత వెలయున్
గొట్టములవలె గననాడులుండున్ ఇనశశినడకలకు ఘననాడులవసరము
గనుకనాడీమార్గము లనుపేరులుండెను మాన్యత వెలయున్ గొట్టముల
వలె గననాడులుండున్॥ 85

వినుమయ్య దేశికోత్తమ మనమలరగ నీసుషుమ్న మార్గం
బునకే మైనన్ పేరులు గలిగిన విననిబుల్క్కమి తండ్రియనగా వినిగురు
రాయుండు నిశ్చలమతివై వినుమనె పుణ్యుండు గనగా తనువున
మోక్ష ఘనమార్గమనిదీని యనయము బుధులెల్ల నవనిపై వాడిరి
విని గురురాయుండు నిశ్చలమతివై వినుమనె పుణ్యుండు॥ 86

పరికింప నొక సుషుమ్నయె యరయంగా మోక్షమార్గమన
బడుటెట్లో తిరముగ దెల్పుమి యనగా గురువరుడిట్లనుచు బలికె
గురుతరంబుగను శిష్యునిమెచ్చి క్షేమంబలరగను సరసంబా సుజ్ఞాన,
సంబంధంబగుతుర్య తుర్యాతీతములనెడి దొడ్డయవస్థల నిరతముబొం
దుటకు గాను నెమ్మిదా వెళ్ళుటకుగాను బరగనిదియే మార్గమగు
టన్ బలుకబడె నిది మోక్షపథమని గురుతరంబుగను॥ 87

నెయ్యంబలరగ తనువున సైయ్యనగా వెల్గుజ్ఞాన సంబంధము
లౌ అయ్యా యా యవస్థల చయ్యనదా బొందుటకును స్థానమది

యేదో యేయావస్థ యెంచదెనియందో తియ్యనిబల్కుల తేటతెల్ల
ముగాను నియ్యెడ దెల్పుమి నీవేగురుడవైతే యెంచ దెనియందో॥ 88

వినుమష్టతనువ్రలందున జనునవస్థల గొందునట్టి స్వస్థానంబుగా
మనుకొని నాల్గవతనువన దనరును తుర్యంబవస్థతనయా వినుమయ్యా
రహస్యంబిది దాచుకొనుమయ్యా అన్న ప్రత్యక్తత్వామలదేహా తీత
మున నెన్నగతుర్యా తీతావస్థయు జెలగు తనయా వినుమయ్యా
రహస్యంబిది దాచుకొనుమయ్యా॥ 89

వినుమయ్యా దేశికేంద్రా తనుమధ్యాంతర్సుషుమ్న దారిలోగన
గన్ ఘనహంసకు నిలయముకై యనువొప్పగ నైదుష్టేషణలున్న
వనుచు జెప్పినారే మునువినమనుచు జనకా యాష్టేషణుల ఘనానా
మములేమిటివో గనగస్థానము లెచటో, కరుణచే సెలవ్విసగుణాలున్న
వనుచు జెప్పినారే మునువినమనచు॥ 90

వరగుదమున నాధారము సరసతమేఢ్రస్థలిన, స్వాధిష్ఠంబున్
ధరనాభినమణిపూరము పరికింపగ హృదయమందు, బలువనాహతము
కంఠమునందు ఘనవిశుద్ధమ్ము యరయగనీయైదే యలరుష్టేషనల
నగా వహసచక్రములనగ వాడబడుకమలములన బలువనాహతము
కంఠమునందు, ఘనవిశుద్ధమ్ము॥ 91

గురువర బాహ్యసుషుమ్నా నరమార్గంబునను నొక్కస్థిరమౌ
ష్టేషణ పరికింపగగలదనుచును సరసత శెలవిచ్చినారే స్థానమదియెచట
పేరేమిటో వాక్రుచ్చుడిచట గురువరుండనియెను కొమరునితో నిట్లు సర
సతజాగ్రతస్థానమందునవుత్రా విరివిగాజ్ఞేయంబను వరష్టేషనుబరుగు
చున్నది పరమతారకపంచముద్రల భావ్యస్థానమదియె గనుము స్థాన
మదియెచటో॥ 92

శరణయ్యా దేశికేంద్రా పరమేశ్వరనన్నుబ్రోవ ప్రభుడవునీవే
విరివిగనురెండుత్రోవలు పరగంగన్గలయుదాని పైగానొకష్టేషణ
యున్నదనిబల్కితిరిగాన సూరిగురువరదాని పేరుస్థానంబును స్థిరము

గఁదెలిపినను వరకృతార్థుని జేయు పైగానొక ప్రేషణ యున్నదనిబల్కి తిరిగానణ॥ 93

చుట్టుకందార్థము.

వినుమోయియద్రిజింహ్వాకు ఘనముఖ దేశస్థలిన కమగుహ మధ్యన్ గనయమృతనదిమీదను మునుకొనిహృత్పుండరీకం బనయము వెలయున్ సత్యంబిదె జెలువొందుచుండున్ బనిబడియష్టతనువనజ మందురుదీని విన్నమి దీనిమర్మమును జెప్పునాతడె తనయవినరాగురుడ టంచును తథ్యముగతలపోయవలయును వినకగనకనుదెలిశి జెప్పక వెతల చెడుదురు వెర్రిగురువులు అనయము వెలయున్॥ 94

గురువర ప్రేషనులనుచును బరువడి శెలవొసగినారె, బలుకృప చేతన్ . వీరివిగ నాంటికిమరి యే స్థిరముగు పేర్లుండెనే మొ, జెప్పుమో జియ్యా యనగురుడనియె వినరామా యయ్యాసరసచక్రములనుచు మ రికమలములనుచును బరువడిపేర్లుండె భక్తిచేవినవోరి చెప్పుమోజి య్యా యనగురుడనియె వినరామాయయ్యా॥ 95

గురువరమీరలెమొదట న్నరయగనిరువదియొకవే, లాఱ్నూన్ హంసల్ బరువడి యెయుంబగన్బుచు నరుసనుచ్ఛ్వాస నిశ్వాసరూప ముగా ఖర్చౌనని సెలవిస్తిరిగా పరికింపనదియేయేబలు వొస్థానములందు వీరివిగ్రనయమహానో, వేట్క చెలుపుమియనగా పరమశిష్యా వెనుక జెప్పిన పద్ధతిన్ ప్రేషనులంతన నురుతరంబుగ ఖర్చుపడుచు నున్నవిరహాహంబ నుచు శ్వాసరూపముగా ఖర్చౌనని శెలవిస్తిరిగా॥ 96

అయ్యాయాప్రేషనులలో ఖీయతఖర్చౌనటంచు వెలిపితిరేమున్ అయ్యాఖర్చవనేమిటో చయ్యన శెలవొసగుమయ్య చాలనుతి జేతు న్ననగాననియె గురువరుడుప్రీతిన్ నియ్యెడదెల్పెద నికవినుముఖర్చనగా అయ్యాయాస్థళములనర్పణగానడమె చాలా॥ 97

గురురాయప్రేషనులలో నరయంగానెవరి కర్పణగునోమీరల్ కరుణన్ దెల్పుడియనగా గురువరుడిట్లనియె శిష్యవరుని గనుగొనుచు

శిష్యుని ప్రశ్న కానందపడచు పరమతనయావినర ప్రతిష్ఠేమనకు జూడ సరసాధిష్ఠానుండు బరగుచుండునిజము తిరముగానధిష్ఠాన దేవ తలనెమేష్ఠ్లకు నరయగానెల్లపుడర్పణ విరివిగానగుచుండునోయి॥ వరు నిగనుగొనుచూ॥ 98

చుట్టుకందార్థము.

గురువర చక్రములందున తిరముగ మేలధిష్ఠాన దేవత శ్రేష్ఠుల్ పరి కింప నెందుకుండిరో కరుణ తెలవొసగుడనుచు వరశిష్యుడడుగ గురునరుడనియె గురుతుగంజిలగ తిరముగనధిష్ఠాన దేవతలయొక్క వరప్రేరేపణలేక నరుసగనాచక్ర వరములెల్లను వర్కుజేయక వసుధ నూరకెనుండుగావున నరయగా ప్రతిచక్రమునకు బరగెనధిష్ఠాన దేవత వరశిష్యుడడుగ॥ 99

పరమేశ దేశికేంద్రా పరికింపగనేయెచక్ర బలుస్థానములన్ స్థిరతన్నె యె యధిష్ఠాన వర దేవతులకెన్ని జూడ గురుతరహంసల్ అర్ప ణయగునో యరయగ మేల్ బల్ గురుడనైనందుకు గురుతులదెల్పియు కరమర్థిబోధించు కరుణ విర్రపీగ గురుతరహంసల్। 100

సరసుడవినుమీగుదమున బరగెడియాధారమనెడి బలుస్టేషను లో వరమేష్టరునై జెలగెడి స్థిరగణపతికారుమూర్తు పరికించ నెపుడు హంసలర్పణగుచుండుజూడు అరమరలేలర హంసమార్గంబును పరికించి చూచిన బలుయోగులిట్లనిరీ పరికించనెపుడు॥హంసలర్పణగుచుండుజూడ

చుట్టుకందార్థము.

గురునయాధారంబున వరగణపతియుండియేమి సగసపుప నులన్ కరమర్థిజేయుచుండునో గురుతుఉగలుగంగదెల్పు కోరివేడె దను అనగవిని దేశికుడనెను సరసతనాధారచక్రంబునందున నరయగణ పతిజెలగి యాధారభూతుడై పరుపుగనందరిచేతను పనులెల్లనుజే యుంచుచు బరగుచుండునుసత్యమిదియో పరమశిష్యానమ్ముమికను కోరివేడెదను అనగావిని దేశికుడనెను॥ 102

జనకారెండవష్టేషనలో వినుతుండెయధిష్ఠాన ఘనదేవతకున్ మునుకొనియు నెన్నిహంసలు దినదినమర్పణమగునో దెల్పుమాయయ్యా యనియడుగగ బలికెనాయయ్య వినుశిష్యరెండవ ఘనస్టేషనైజెలగు వినుతస్వాధిష్ఠాఖ్య విమలచక్రంబున పనిబడిబ్రహ్మకునుజూడ బాగుగా నార్వేలహంసలు ఘనతరార్పణమగుచుండును గనుపెట్టిచూచువారికి దెల్పుమాయయ్యా॥ 103

యోదేవబ్రహ్మదెప్పుడు స్వాధిష్ఠానమునందుజెలగి సరసతమె రయక మోదంబేపనిజేయునో సాధుమణీదెల్పుమనగా సద్గురుడనియే శిష్యావినుమీ తెలుసుకోమనియె సాధువినుతుండైన సరసిజసంభవుడు స్వాధిష్ఠముననుండి సత్సృష్టిజేయును సద్గురుడనియే॥ 104

వరనాభినజెన్నొందెడు పరమసుమణిపూరచక్ర పతియాహరి కీన్ పరికింప నెన్నిహంసలు తిరముగనర్పణమునగునో దెల్పుమియనగా గురువరుడనియెసంశయముబోగా నరయమణిపూరకాఖ్యచక్రంబున విరివిగ హరికారువేలహంసార్పణ దెల్పుమియనగా గురువరుడనియె సంశయముబోగా॥ 105

## చుట్టుకందార్థములు.

సలలితసుగుణావిష్ణువు సలమణిపూరసుచక్ర మందుననుండీ నెలకొనియేయేకార్యము విలశితముగజేయుచుండు వేదెల్పుమయ్యా యనియడిగిన బలికెనాజియ్యా యలవిష్ణుమూర్తియు నామణిపూర మున సలలితమునుండి సమానవాయువుచే బలువుగాభక్షించునట్టి పదార్థపురసము లెల్లను సలలితనాడులకెల్లను విలసితంబుగపంచిపె ట్టును॥ 106

సుమనయనాహతమనియెడి విమలసుచక్రంబునందు విరివిదలి ర్పన్ కమనీయ్యంబుగజెలగెడి యమలాధిష్ఠానదేవతకు నెన్నిహంసల్ అర్పణయగును యవిదెల్పుడనబల్ సుమహితాత్ముడుగురుడు సూటిగ నిట్లనియె విమలమనాహతవిశదచక్రంబున సుముఖుడౌరుద్రునకుగనగా

సూటిగానా క్ర్వేలుహంసలు క్రమముగా నర్పణమగును గాంచువారికి దెలియునిదియు॥ 107

గురువర్యరుద్రుడచటను బరగుచు సేపనిసి జేయు బాగుగ గనగా గురునరుడిట్లనిబలికెను విరివిగ శేష్యుసిగాంచి, వేడుకలుంగా వినుమని యప్పుడె వెలుపదొడగరుగాను యరియరుద్రుండనా, హృతచక్రమం దుండి నరునభుజియింపబడు నస్తువులనెల్ల పరిగ ప్రాణవాయువుచే బలుహృతము జేయించుచుండును స్థిరత ప్రాణమునువశ్యము జేసినవ తికాలకష్టసాధ్యము॥ 108

వినుతంద్రిడివిశుద్ధంబున ఘనముగి మహేశుడుండి, కరుణదలి ర్పన్ మనమలర నేమికార్యము దినదినమున జేయుచుండు దెల్పుమా యయ్యా సందేహంబు, దిరిమాయయ్యా విశుశిష్యవిశుద్ధ, విశదచ క్రంబున మాన్యుడై ఉన్నందు మహేశ్వరుడుజూడ ఘనతరశబ్దము లనెల్లను గళిమునందుదానమునబల్ పసిబడిపల్కించుచుండును బా గుగాగని పెట్టిజూడుము దెల్పుమా॥ 109

హితమతిగురువరవినుమీ చతురితపిశుద్ధాఖ్య చక్రమునందున్ సతతమధిష్ఠానస్వామికి యతులితముగ నెన్నిహంస లర్పణమగునో దెల్పు మనిన దేశకుండ నెనూ మతిమస్తావిశుద్ధమహాసియ్యచక్రమున పతిమ హేశ్వరునకు జగావేయుహంసల్ సతతమర్పణమగుచుండును సాంఖ్యు లిదిగని పెట్టిబల్కిరి యమలితంబుగబల్కినాడ మతిసమగురువకుండు నె ప్పుడు అర్పణంబగునూ॥ 110

గురుడా యాజ్ఞేయంబున స్థిరముగ ఉన్నందధిష్ఠాన, దేవతకర యన్ పరికింప నెన్నిహంసలు విరివిగనర్పితమగునో, వివరింపుమనగా వినిగురుడసియె వేట్కరంజలగ సరసుడజ్ఞన జెలగు సదాశివమూర్తికి నిరతము వేయిహంసల్ నిజార్పణంబగును వివరింపుమనగా॥ – 111

లలితాజ్ఞేయమునందున బలుసదాశివుడుండి యేమి పనులను జేయున్ దెలుపుమి యన గురుడసియెను సలలితాజ్ఞేయ మనెషి

సచ్చక్రమునను సదాశివుండనయ ముండియును కల్లజీవునకు సంకల్ప కల్పములు గలిగించుచుండును, గనిపెట్టి దెలియుము సచ్చక్రి॥ 112

వినుమయ్య దేశికేంద్రా ఘనతసహస్రారమనెడి, కడుస్థేషను లోమునుకొని జెలగెడి మేశ్వరు ఘనుడగు గురుమూర్తి కెన్నిజనుహం సార్పణలు నగునో దెల్పుమని మంచికీలు ననయముసహస్రార మందు గురుమూర్తికి వినుమి వేయిహంసల్ నెలయునర్పణంబు, జనుహం సార్పణలు॥ 113

పరగసహస్రారంబున గురుడుండియు నేమిపనులచేయించునో కో సరసతదెల్పుమియనగా గురువరుడిట్లనియెశిష్య వరునిబాడగాంచి తగిన శిష్యుడనిమదినెంచీ తిరముగనధిష్టాన దేవతలకుగాని కరమర్థిజీవునకు గానియెవరికైన సరసతన్నందురును జేయు సర్వకార్యంబులకునెల్ల వరు ససాక్షీభూతుడయ్య వర్తిల్లు నెల్లపుడు॥ 114

గురువరవినునామనవిని యరయంగాహంసలర్పణగునంటిరెముః బరువడియర్పణయనగా తిరముగనేమిటిదో దెల్పు దేశికవర్యా సంది యంబుదీర్పుమాయయ్యా యరయశిష్యుడవినుమీ యాయాచక్రిము లున్న పరమస్థానములకు బాగజనిహంసకళ విరివిగాదాకుటయెయ ర్పణ విధమిట్టిదనిరిగురువులు పరమశిష్యులీరీతి బాగుగానేనమ్మి జెలగి॥ 115

గురువరహంసయనగా పరికింపగనేమియదియు ప్రాభవమొప్పగ వరుసగదాకుటయేమిటి విరివిగనీమర్మమెల్ల వివరింపుమనగా వినిగురుడ నియె వేడుకబాగా సరసప్రాణవాయు సంబంధములైన నేరుపు నుచ్ఛ్వాస నిశ్వాసములకే యరశిహంసయనెడినామముగురురాయులు మున్నుబెట్టిరి పరగనీసంబంధవాయువె బాగదాకునదియెజూడగ వివ రింపుమనగా॥ 116

గురురాయప్రాణవాయువు బరువడిహృదయంబునందు బరగు సుగదయా వరప్రాణవాయువేగన సరసతనాధారప్రముఖ సచ్చక్ర

ములకు వచ్చియట్లుస్థిరముగదాకు వీఁవిగనర్పణమెవ్విధియగునోయది పరమకృపచేతను బల్కుమియోయయ్యసచ్చక్రిములకొ వచ్చియిట్లు స్థిరముగదాకు॥ 117

చుట్టుకందార్థము.

హృదయస్థానంబందలి పదపడి వసియించు ప్రాణపవనంబు నర్గు గుదస్థానమందు వర్తిలు బొదలెడియపానవాయువు, నకుగను గొనగా సంబంధంబు సరసములరంగా పదపడి యుండియర్గ బాగుగ రెంటికి విదితమార్గంబుండె వినుమందువల్లనె కదసి యంతర్యీడపిం గళలద్వారా హృదయస్థలమున వదలక నిలచిన ప్రాణవాయువాపాన సంబంధ నాడీమార్గద్వారా పదపడిదిగి, దిగువ మూడు సదమల చక్రములదాకి పిదితార్పణమగుచున్నది॥ 118

గురుగాయ మనవివినుమా యరయగ నిరువదియొకవేల యూర్ద్నార్ హంసల్, తిరముగ నేసంబంధమొ పరికించియు దెల్పు మనగా గురువరుడనియే దెలిపెద నికమునువకు మన్నియే వరశిష్యా యివి ప్రాణవాయుసంబంధపు మగిజీవహంసలనె మరుగు పేర్వోటికి గురువరుడనియే॥ 119

జనక యీజీవహంసలే తనువుకు నర్పణంబగునో తథ్యంబలరగ మనమలర దెల్పువిూ యన విని గురుడిట్లనియె మిగుల విశదంబుగాను దెల్పెద సందేహంబణగగను తనయా యీస్థూలాఖ్య తనువుసంబంధ ముకే పనిబడి యర్పణపనిబడి యగునోయి విశదంబుగాను దెల్పెద సందేహంబణగగనూ॥ 120

జనకా యివ్విధమున నే యనయమునగ సూక్ష్మకారణాఖ్యం బులునౌ తనువులకెల్లను హంసలు బసిబడిగలవాయనంగ, బలుగురు డనియె కరుణచేత శిష్యునిగనియే వినుసూక్ష్మకారణ తనువులకును గూడ పనిబడిహంసలు ప్రబలుచునున్నవి తనయ హంసలు లేకపోయిన తనువులకు సంచారమేడది గనుక హంసలున్నవ్రాయి గనిపెట్టిరి సాంఖ్యగురువులు బలుగురుడనియే॥ 121

గురువరయాలాగైతే కరమరుదుగ హంసలెన్ని గనపెరేమీ పరికించి దెల్పుమీయన విరివిగ గురుడనియె శిష్య వీరునిగాంచీ తనలో దాను బలుసంతసించీ వరుస ముప్పదినాల్గువందల హంసలు బరువడి జెలగును, బాగుగవాటికి బేరయనీశ్వర హంసలనుచును పూర్ణజీవ హంసలనియును పరమయోగులు గనిపెట్టిరి బాగయోగమార్గము లచే వీరునిగాంచీ తనలో దాను బలుసంతసించీ॥ 122

చుట్టుకందార్థము.

గురువరయీశ్వరహంసలు దిరముగనేస్థానమందు తేజంబలరన్ పరికింపసృష్టియైనవి బరువడిసంబంధమేమో బల్కుమీయనగా గురు మణియనియే గురుతురంజిలగా యరమరలేలరయదియు నే దెల్పెదవినరా బరువడియాహంసల్ బ్రహ్మాండమందున్న పరమసింశుమారచక్రపు వరమధ్యభాగమందున తిరముగాను సృష్టియయ్యె దెల్పు మందువలన యా పరమహంసలు బ్రహ్మాండ భాగసంబంధములెగనగా బల్కు మియనగా॥ 123

గురురత్నమయాహంసలు సురుచిరముగ నచటనెట్లు సూటిదలిర్పన్ బరునడిసృష్టినిబొందెనో పరికించియుదెల్పుమనగా, బలుగురుడని యే పరమశిష్యుడనిముదముగొనియె పరమాత్మకళమైన బలుహాకా రంబును విరివిప్రకృతికళ వేట్కసకారంబున్ పరగగా మేల్బిందువుతో బాగజేరి హంసయయ్యె పరమశిష్యాహంసనిల్పిన గురువరుడే పర మహంసగురువర్యుడనియే॥ 124

గురువర్యుడయాహంసయు పరగగనాస్థానమందు బాగుగనెన్ని వరనామంబుల జెలగెను పరికించియు దెల్పుమనగా పరమగురుడనియే శిష్యుడమంచి సరసుడవనియే పరమహంసయని వరశింశుమారుడని పరమేశ్వరుండనగ బరగుపేరులచేత గురువరుడనియే శిష్యుడమంచి సరసుడవనియే॥ 125

గురునాథుడయాహంసయు పరమాత్మస్థానమందు బరగునటంచుఁ ధరనెవ్వరు గనిపెట్టిరి కరుణాకర దెల్పుమనగా, గనిగురుడనియే యెంతటివాడు వీడనుకొనియే విరివిగనుమాన, హితుండైనదాను సరసతుర్యాతీత, స్థానమందలియున్న బొరశిమూలప్రకృతివిరాట్పురుషుల లోగలశియును వరప్రత్యగాత్ముడయ్యెను, వరుసగా గనిపెట్టినాడు గనిగురుడనియే॥ 126

శరణయ్యదేశికేంద్రా పరగంగానపుడుదాను భావంబలరఁ విరివిగనేరూపుండై స్థిరతఁవీక్షించినాడొ శెలవొసగుడనియెఁ వినిగురువరుడు మరలనిట్లనియెఁ విరివిగలక్ష్యార్థవిశదస్వరూపుండై తిరముగ లక్షించె దెలుసుకొనుమిపుత్రా శెలవృసగుడనియెఁ వినిగురువరుడు మరలనిట్లనియెఁ॥ 127

అపుడెవ్విధమున నాతడు విపులాలోచనముజేసె, వినబడెనేదీ సుపథంబుగ దెల్పుమియన యపగతకలుషుండు గురుండనియె శిష్యునితో మర్మంబెల్ల జెప్పెదనీతో నీపగిదిహంసనునిజమువిచారించ దాపరమహంసయై దనరారునెల్లపుడు ప్రాపుగాను హంసవిషయము బాగనింపుకైన నెరుగక నేపరమహంసనన్ను నెవ్వరొప్పుదురేదిమోక్షము డనియె శిష్యునితో॥ 128

చుట్టుకందార్థము.

వరమస్త్రితృియదితౌతృియ పరికింపగవస్తుతృియ భావతృియమరఁ విరివిగవీటికతీతము నరయగవిద్యావిద్యరహితమై జెలగునట్టి నిర్వాసనా మూలమానట్టి పరమస్థానమునందు బలుశ్రిద్ధాశ్రిద్ధలచే

విరివినాలోచించ వేగమెయామహా పరమసత్వములోననుండియు బలు హాకారసకారంబులు పరమబిందుయుక్తముగా ప్రబలనాదమువినబడి నది మైజెలగునట్టి నిర్వాసనామూలమానట్టి॥ 129

గురుపుంగవయానాదము కరమగుదుగనెన్నిగతుల గానున్న దియో పరికించిదెల్పుమనగా విరివిగవినిదేశికుండు వివరింపదొడగె శ్రద్ధబూని వినుమిపుడేయనియే కరమునాదబిందు కళలనిమూడుగబర గుచునున్న విభక్తాగ్రిగణ్యుడ॥వివరింప॥ 130

చుట్టుకందార్థము.

ఆనాదబిందుకళలతో మానితముగగూడిహంస మహిమద లిర్వ ధీనుతబ్రహ్మాండంబున మానుగవర్తిలియునేయేమార్గములనుండి పిండాండమునకు మరివచ్చెనండీ సూనుడదెల్పెదసురుచిరముగవినరా మాన్యరవిచంద్రాగ్ని మండలంబులద్వారా దీనుతపిండాండమునకు దివ్యశూన్యశిఖపశ్చిమ మానితమార్గములద్వారా మరివచ్చెనునిజము పుత్రా॥మరివచ్చెనండీ॥ 131

గురునాథుడయాహంసయు పరికింపగనేమెనాడి పథములవల నట కరమరుదుగనేతెంచెనో సరసగుణాదెల్పుమనగా, సద్గురుడనియే సంశయంబు దరుగునికనియే పరమశిష్యావినర బాగుగదెలిపెద సురుచి రేడాపింగళ సుషుమ్నలద్వారా విరివిగానేతెంచెనోయి విశదముగాదె ల్పితినిటు పరమయోగులుగనిపెట్టిరి తిరముగా నాయనుభవంబిదె సద్గు రుడనియే సంశయంబు దరుగునికనియే॥ 132

గురుదేవుడయాహంసయు బరువడి యేరూపముగను బాగుద లిర్వ స్థిరతరముగానువచ్చెను పరికించియుదెల్పుడనగా పరమగురుడని యే జెప్పెదనికమరువకుమనియె సరసగంగాయమునా సరస్వతులనెడి పరమప్రవాహరూపముగానువచ్చినది పరమగురుడనియే జెప్పెదనిక మరువాకుమనియే॥ 133

గురురత్నమయాహంసయు బరువడిపిండాండమునకు బాగుగ

వచ్చి పరికింపగ నెచ్చోటున వరుసగదా జేరియుండే వచియింపుడనగా
వినియు నాగురుడు వేడ్కరంజిలగా నరయసూర్యచంద్రాగ్ని స్థానములందు
స్థిరముగ జేరినది తెలియుమోయిపుత్రా వచియింపుడనగా విసిగురుడని
యె వేడ్కరంజలగా। 134

ఆస్థానమునకు జేరియు భాసురముగ హంసయేమి బలుపేరొందె
న్నా సంగతి దెల్పుమియన వాసనసుతుడనియెశిష్య వరునిబొడగాంచి
జెప్పెదనికవినుమిదిపొంచి యీ సుతహకారసకారరూపముతో భాస్వ
ద్గంగాయమునా బలుమధ్యదేశమున వాసిమీరగ జెలగుచుండెడి వరస
రస్వతియనెడిబిందు సుస్థానంబునకు జేరియు సురుచిరంబుగ హంసమై
నది వరునిబొడగాంచి॥ 135

తిరిగి యాహంసగురువర బరువడి యెచ్చోటనుండి బాగుదలి
ర్పగ స్థిరముగ నేడకుజనునో పరికించియు దెల్పుడనగా పరమగురుడసి
యే తగిన శిష్యుడనిమెప్పుగొనియె సురుచిరంబుగహంస సూర్యచం
ద్రాగ్నుల వరస్థానంబులనుండి వరుసశిఖాదిగ పరమసహస్రారమందు
న బాగ ప్రవేశించినది స్థిరముగానీహంసవిధము దెలుపువాడే దేశి
కుండు॥ 136

ఆసహస్రారమందున భాసురముగ జేరిహంస, ప్రభలు వెలుంగగ
ఆస్థలమున నెయుండెన యోసామీయెచటికైన నొనర వెళ్లినదా దెల్పక
నున్న సంశయముగాదా నాసుతుడవినుమామహాస్థానమునుండి భాసు
రంబుగహంస బాగుగ వెడలియు నాసత్పరా న్తమాధారాది పర్యంత
ము వేసరక వ్యాపించియుండెను వినరగనరా యనుభవంబిది యొనర
వెళ్లినదా॥ 137

ఆవ్యాపించినహంసయు శేవ్యగుణాధారమందె జెలగునో లేకగ
వామిరియెక్కడనుండియు ధీవిలసితయెచటికైనా దివ్యంబుగాను వెళ్ళు
నేమొ భావంబలరగను శేవకునకు జెప్పి స్థిరముగాబోధించు సావధాన
ముగాను సద్గురుడ వేడెదదివ్యంబుగాను వెళ్లునేమొ భావంబలరగను॥

## చుట్టుకందార్థములు.

ఆనాదబిందువులకునుమానుగనిలయంబునైన మహాకళవినుమా బూనియునాధారంబును ధీనుతవదలియును హంక్షుందివ్యవర్ణముల గూడియున్న దేదీప్యముల మానితసుషుమ్న మరియుసుఖసుషుమ్న లను దాటిగుహామధ్య ఘనప్రదేశంబైన మాన్యఫణాదిసహస్రపునడిదేశ మందున ధీనుతుండా జేరియున్నది దెలశివెలగుము మర్మమిదిరా దివ్య వర్ణముల గూడియున్న దేదీప్యముల॥ 139

గురువరసహస్రారంబున పరికింపగహంసజెలగి బాగుగనేయే వరనామంబులుబొందెనో సరసగుణా దెల్పుమనగా సద్గురుడనియే దెల్పెదనిది మరువకుమనియే పరమహంసయనిప్రత్యగాత్మయని వరసూత్రాత్మయని వాంఛజీవాత్మయని తిరముగపరమాత్మ యనుచును దివ్యాంతరాత్మయనియునుసరసాభిమానపేరులస్థానభేదముచేతబొందెను సద్గురుడనియే దైల్పెగనిది మరువకుమనియే॥ 140

గురువరయాపేరులతో బరగుచునున్నట్టిహంస పరికింపంగా తిరముగనేరూపముగా కరమరుదుగనుండెదెలిపి కరుణరక్షింపూ మనిన గురు వరుడనియెపెంపు పరమశిష్యావినుమిబాగుగనివార వరశూకమ నెడినెవ్వరిముల్లుగానుండె సరసమాబంగారులతవలె స్థిరముగాప్రకాశ రూపుగ బరగియభిమానపేర్లతో బరగుచుండునెల్లప్పుడుకరుణరక్షింపు మనినగురు వరుడనియెపెంపు॥ 141

గురువరయివ్విధిజెలగెడి వరుసముఫ్వేలనాల్గువందలునీ శ్వర హంసలునేయేయే వరతనువులకెన్నిజూడ వరుసజెలగంగా నర్పణ యగునో మరిదెల్పుమనగా పరమశిష్యావినుమి బలుసూక్ష్మతనువుకు పరికింపరెండువేల్బాగనర్పణమగును తిరముగకారణాఖ్య దేహమునకు జూడగాను వరుసగాపదినాల్గువందలు పరికింపగనర్పణంబగు॥ 142

గురుడాకారణతనువుకు నరయుగపదు నాల్గువందలర్పణమ

నుచుక్ తిరముగ శెలవొసగితిరే సరసతకారణతనువు సంబంధమైన పరమస్థాన వరములకునానా పరికింపనేయేయే బలుస్థానమున కెన్నో పరమహంసార్పణమొ బాగుగదెల్పుమనె సంబాంధమైన పరమస్థాన వరములకునానా॥ 143

## చుట్టుకందార్థము.

సరసుడదెలిపెదవినరా గురుతరముగ ప్రత్యగాత్మకునువివరింప న్నరయగ తత్థ్వానాధీ శ్వరునకు నలుబదిహంస లర్పణంబగును గనిపెట్టిరి యోగులుమున్ను సరసగంగాయమునా సరస్వతులకును కరముత్రివేణీ సంగమస్థానమందున బరువడి యేబదిహంసలు, బాగన ర్పణమగుచుండును తిరముగా నీ మరుగుదెల్పిన దేశికుఁడే యోగీశ్వ రుండు అర్పణంబును నని బల్కిరి యోగులు మున్నూ॥ 144

వినరా దెల్పెదబాలక ఘనసద్యోజాతపఞ్చ కర్తలకెపుడుఁ తనయుడయాధారాదిగ ననవరతంబాపంచదళము, లందునగనగా యిరువదియైదు ఘనహంసలుగా మునుకొని యర్పణము ముదముచే నగుచుండు ననయమీశ్వరుండై గనిపెట్టదెలియును అందునగనగా నిరువదియైదు ఘనహంసలుగ॥ 145

వేడుకమీరగ దెలిపెద నిడాపింగళ సుషుమ్నలకు, నింపుదలి ర్పక్ కడువడి త్రికూటంబున బుడుతడ విను మిరువదైదు పుణ్యాహం సలు నర్పణంబగు పొలుపొందమేలు నేడీహంస నడక జాడఁదెలిపినట్టి వాడె గురుమూర్తియని, వదలకుండగవలయు పుణ్యాహంసలు నర్పణ మగు పొలుపొందమేలు॥ 146

సరసుడ దెలిపెదవినరా స్థిరముగ నిర్వాసనాప్రదేశంబుగనా పరమాత్మని సంబంధము విరివిగ ప్రత్యక్ప్రతి బింబమార్గముకు మరిపదిహంస లర్పణమరువకు పరికింపనాజ్ఞేయ పరమచక్రమునందు మరిద్విదళములకు భ్రూ మధ్యస్థలమునందు పరగరెండు నూరులేబది

పరమహంసలర్పణమగును పరికించి దెలియువారలు పరమయోగులు శిష్యపుంగవ బింబమార్గముకు॥ 147

వరసహస్రారమునకును పరికింపగ మెట్టమధ్య భాగమునం దుఁ కరమర్ధి వేయుహంసలు వెరసియు కారణదేహ వరసంబంధము కునిదిదెల్పెద మరుపుజెందకు, వరుసగపదునాల్గువందలర్పణమగును ఠీరముగ దెలిపితి తేటపడగ దెలియు వరసంబంధముకు నిదిదెల్పెద మరుపుజెందకూ॥ 148

గురురాయ మనవిజేసెద సరసతచే సూక్ష్మదేహ సంబంధము కై పరిశుద్ధముగా మేలగు పరికింపగ రెండువేల పరిపూర్ణహంసల్ దెలుపుమాకు తేటగానుబల్ సరససూక్ష్మదేహ సంబంధమైనయే పరమస్థానములందు పరగనెన్నర్పణ పరిపూర్ణహంసల్॥ 149

వినరాసుతుడా దెలిపెద మునుకొనియాధారచక్ర, మునకుగ నంగఁ అనయంబునాల్గువందలు ఘనతరహంసార్పణంబౌ గాంచపొం చియును దెలియున్యోగియెంచిచూచినను వినుమిమేఢ్రస్థానమున జెలగ స్వాధిష్ఠ ఘనచక్రమునకును గనగనాల్గువందలర్పణంబగును గాంచ పొంచియునూ॥ 150

సరసుడ నాభినజెలగెడి యరయగమణిపూరచక్ర మందుననె పుడుఁ సరసతనాలుగువందలు గురుతరహంసార్పణంబు గూడుచు నుండు గన్నవాడే పరమగురుండు పరికింపహృత్స్థలిన ప్రబలానాహత మున నరయనాలుగువంద, లర్పణంబగునచట గూడుచునుండు గన్నవా డే పరమగురుండూ॥ 151

వరకంఠస్థానమందున నరయవిశుద్ధచక్రమందుననెపుడుఁ బరు వడివాలుగువందలు గురుతరహంసార్పణంబుగోరియగుచుండు హంసను నిల్పునరుడేదేవుండు సరససూక్ష్మదేహ సంబంధమునకును వెరశిరెండు వేల పరమహంసార్పణ గోరియగుచుండు హంసనునిల్పునరుడేదేవుండు॥

గురువర యీతనుత్రయమున నరయంగానర్వ్రణైన హంసలు యె న్నో కరమరుదుగ దెలుపుమియన పరికించియె బలికెగురుడు బలుశిష్యునితో కుశాగ్రమగు వరమేల్బుద్ధితో తిరముగావినుమూడు దేహములందున విరివియిరువదియైదు వేలహంసార్పణ బలుశిష్యునితో కుశాగ్రమగు వరమేల్బుద్ధితో॥ 153

గురువర వినుమీహంసలు బారయంగానెపుడులేక బోవునో జెపుమా శరణార్థినియనియడిగిన గురుతరశిష్యునిగాంచి, గురుడిట్టులనియె వెరువకుమోయి మరిగిదియనియె తిరముగా నీమూడుదేహంబు లెప్పుడుహరియించునో యపుడే హంసలు లేకుండు గురుడిట్టులనియె వెరువకుమోయి మరగిదియనియె॥ 154

చుట్టుకందార్థములు.

ఈమూడుదేహములలో స్వామీయేతనువుబోవు సత్యంబలరగ విమలాయాతనుసంబంధపు క్రమమగుహంస లేమి, కాగలవ్రా చెపుమీ ననుకృపచేతగాపాడుసుమీ సుమహితదెల్పెద సూటిగ నేతనువు సోమముఖబోవ్రనో సొంపుగానాహంసల్ విమలతత్సంబంధమందున వేగజేరుచుండునోయి సుముఖుడా నేదెల్పినాడను జూచిదెలియుము మోదమునను కాగలవ్రచెపుమా॥ 155

చుట్టుకందార్థము.

జనకుడమనపనివినుమా గనస్థూలముతనువుబోవ గనుతస్థూలఘనహంస లేమియగునో వినుపింపుమియనగగురుడు విరివినిట్లనియే శిష్యావినుముజెప్పెదననియె వినుస్థూలదేహంబు విరివిగనశియింప పనిబడి తద్దేహ,బలుహంసలైనట్టి యన్నిరువదియొక్క వేల యార్యార్థహంసలును వినరప్రకృతిలోపలను తనయజేరియుండునోయి విరివినిట్లనియే శిష్యావినుమిజెప్పెదననియే॥ 156

గురురాయసూక్ష్మదేహము బరువడినశియింపగానె ప్రబలుడవినుమీ పరికింపపూర్ణహంసలు విరివిగనేమౌనో దానివివరింపుమయ్యా

సందేహంబువిడగొట్టుమయ్యా యరసియునీరీతియడుగుశిష్యునిగాంచి ప
రమమోదంబున బలికునివ్విధిగురుగుహ వివరింపుమయ్యా॥ 157

వినుమీశిష్యాదెలిపెద ననువుగ మేల్సూక్ష్మతనువు నశియించుట
కుఁ ఘనమగుకారణదేహము తనయానశియింపగానేతక్షణమున సూ
క్ష్మతనువు నశియించుగాన ఘనముగకార్యకా రణరూపములైన మును
సూక్ష్మకారణ ములు రెండుగూడియును పనిబడియునొక్కమాటుగ బా
గుగాగురుకృపచేతను తనయుడానశియించవలెరా తనువులురెండొక్క
మాటె తక్షణం. 158

గురుడామనవినివినుమీ కరమద్ధినికారణాంగ కార్యాంగం
బుల్ తిరముగ రెండొకమాటుగ బోరయంగానెపుడు లేక బోవునో
జెపుమా సంశయంబు దరుగగ జేయుమా విరివిగనీరీతి వేడుకొనినశిష్యు
గనిగురుశేఖరుడు కరుణచేనిట్లనియె పోవునొజెపుమాసంశయంబుదరు
గగ జేయుమా॥ 159

చుట్టుకందార్థములు.

తిరముగ నాత్మానాత్మ వరవిచారణంబుజేసి వాంఛలులేకఁ
బరువడిగాననాత్మ దరముసంబంధంబునందు దానుజేరకనా యంతఃకర
ణాధిష్ఠానమైన పరమచైతన్యమగు ప్రత్యగ్గ్రమందు విరివిగనైక్యమై
నట్టిహేతువుచేత నరయప్రత్యగాత్మపర మాత్మలుదోచకబ్రహ్మ విరివి
భూతుడై యెవడు విదేహముక్తుడగునో తిరముగానటువంటివానికిదెలియ
సూక్ష్మకారణంబులు బరువడినొకమాటుగానే బాలకానశియించు
లేకను॥ 160

గురుశేఖరమనవినివిను మరయంగా సూక్ష్మకారణంబులు
రెండుఁ తిరముగనశియింపంగా సరసుడతరువాతరేటి సంబంధమైన
పూర్ణహంస లేమానునానా పరమశిష్యావినుమిబాగుగనాహంసల్ పరి
కింపమొదటనుబ్రహ్మాండముయొక్క నరయశింశుమాచక్ర మందుడిపిం

డాండ వరమునకువచ్చినవిగావున తిరిగిళింశుమారమును జేరు॥ సంబంధమైన॥ 161

గురురాయుడయాహంసలు నరయంగాదిరిగిళింశు మారంబునకుఁ బరువడిజేరడమునకును పరికింపగకారణంబు బల్కుమోదేవా సంశయంబుదీర్చుసుభావా గురువరుడిట్లనియెకొమగుడావినుమోయి పరికింపబ్రహ్మాండ బలుసత్తావల్ల నెతిరముగాపిండాండమెల్ల నుతేజరిల్లుచుండుగావున పరగగానాహంసలెల్లను తిరిగి బ్రహ్మాండమును జేరును బల్కుమోదేవా సంశయంబు దీర్చుసుభావా॥ 162

గురుశేఖరపిండాండము నరుసగబ్రహ్మాండసత్త వలననెనడచుఁ తిరముగనని దెల్పితిరే యరయగపిండాండ బ్రహ్మాండములకును సంబంధంబే తీరుననగును పరికించిబోధించుపరమగురుడవైతే విరివిగలేకున్న విడదుసంశయంబు హ్మాండములకును॥ 163

వినరాశిష్యాదెలిపెద తనువనెపిండాండమందు తగపనిముల్లాగననిరువదియైదింద్రియముల కునునధిష్ఠానదేవు లనబడువారల్ ఇరువదియైదు గురువినుధీరుల్ అనయము బ్రహ్మాండమనెడియీశ్వరదేహమునునింద్రియములుగా మునుకొనియున్నారు గానసీశ్వరేంద్రియములు గానున్న దేవతుల ఘనప్రేరేపణముచేత నెగలుగుపిండాండమునపనులు గానబ్రహ్మాండంబు పెద్దగడియారముజూడగాను మానితంబగుపిండాండము మరిచిన్నగడియారము॥ అనబడువారల్॥ 164

ఆగామిసంచితప్రారబ్ధ కర్మవిషయము-విచారణ.

శరణయ్యదేసికేంద్రా మరియును సహస్రవనజ మధ్యనుండెవరహంస యెచటయుండియు స్థిరముగనేమేమిపనుల, జేయుచునుండూ ననినగురుం డిట్లనియెమెండూ యరయగదళములయందుండి దళద్వారా కరముగుణకల్పనలు గలుగజేయుచునుండు నిట్లనియెమోడూ॥

చుట్టుకందార్థము.

గురువరయాగుణకల్పన పరికింపగ నెట్టులగునో బల్కుడియనగా

గురుశేఖరుసిట్లనియెను తిరముగ వినుమోయి బిడ్డా దెలియబలికెదనూ సాంఖ్యమిదె దెలియుముసీవికను కరమర్థిగుణముల, కల్పనలెల్లను పరమదళములద్వారా బరగుచునుండును సరసుడా విను సాంఖ్యమెరుగక, సంకిళ్ళువదలవందురు తిరముసగుణబ్రహ్మానెరుగక, దెలియుటెట్లగు నిర్గుణంబును దెలియబలికెదను సాంఖ్యమిదె॥ 166

గురువరయేయేదళముల బరువడిగా హంసస్త, బాగుగబడినట్టి తిరముగనేయేగుణములు వరుసగగల్గుచునుండు, వాక్రుచ్చుమయ్యా మీచరణములే గతిమాకికయయ్యా గురుడెతల్లి దండ్రిగొప్పదైవంబని నెరనమ్మియుంటిమి నిక్కముగా దెల్పు గతిమాకికయయ్యా॥ 167

సరసుడ యీశ్వరతనునగు నిరువుగ నవ్యక్తరేకు నీశాసదిశల పరికింపగదలుదళమున కరమరుదుగ హంసస్త ఘనతబడగానే ధనదానము దాజేయవలెననే విరివిగుణముగల్గు వేడుకరంజిల్ల కరమర్థిసీరీతిగని పెట్టుయోగివైన ఘనతబడగానే॥ 168

వరపుత్రేశ్వరతనువగు నురుతరమహత్తత్వరేకు నుత్తరపుదిశల బరువడి కదలెడిదళమున కరమరుదుగహంసస్తఘనతబడగానే మిక్కిలిప్రీతికరమగుపనులనే యరసిజేయవలెనని గుణముగలును పరగలో చూపుచే బాగగనిపెట్టుము ఘనతబడగానే మిక్కిలిప్రీతికరమగు పనులనే॥ 169

## చుట్టుకందార్థము.

సూనుడ యీశ్వరతనువగు మానితమహంకారరేకు, మరివాయుదిశల బూనియు కదలెడిదళమున ధీనుతుడాహంసస్త దివిరిబడగానే గమనాగమనాదులు జేయవలెననే నూన్యచారిత్రుడ మరికోరికెలు గల్గు బూసియోగివైన మేనిహంసనునిల్పి మేనునసడినాళమందున మించిపవనమనములతో మానుగానునడచుహంసను మరియునిల్పుము పశ్చిమంబున దివిరిబడగానే॥ 170

చుట్టుకందార్ధము.

గురుపుత్రేశ్వరతనువగు వరుసతనాకాశ రేకు వరుణునిదిశలో బరగుచుకద లెడిదళమునకరమరుదుగ హంసనత్త ఘనతబడగానే క్రీడా దులను జేయవలెననే మరిగుణముగల్గును మాన్యచారిత్రుడ స్థిరముగ నాగుణము దిప్పి యింద్రియముల మరియునిల్పిసుఖసుషుమ్నా మార్గ మునదానేగితుర్యము పరమపశ్చిమబ్రహ్మతానై పరబ్రహ్మనుగలయ వలయును॥ ఘనత॥ 171

వరశిష్యజీవతనువగు నరయంగావాయురేకు నైఋతిదిశలో బరువడికదలెడిదళమున కరమగునుగహంసనత్త ఘనతబడగానే పాప పుపనులబలుజేయవలెనని విరివిగుణములుగల్గు గురుపుత్రుడవైతె పగ గగుణమునుమాని వరసమాధిననుండు ఘనతబడగానే పాపపుపనుల బలుజేయవలెననీ॥ 172

వినుమోయిజీవతనువై దనరెడిమేలగ్నిరేకు దక్షిణదిశలో బనిబడికదెలెడిదళమున గనుగొనగాహంసనత్త ఘనతబడగానే క్రూర మైనపనిజేయవలెననే ఘనగుణమువాటిల్లు గాననాగుణమును పనిబడి మళ్ళించు మనుజుడేసుజ్ఞానిఘనతబడగానే॥ 173

వరతనయ జీవతనువగు నరయంగానప్పురేకు నాజ్ఞేయదిశగ బరగుచుకదలెడిదళమున బరువడిగాహంసనత్త బడినమాత్రమునగ దెల్పెదనికవినుమీమోదమునగ అరయగనిద్రాలస్యాదులుగల్గును స్థిరని ద్రదలో నిద్రదెలియువాడెయోగి బడినమాత్రమునగ దెల్పెదనికవిను మీమోదమునగ॥ 174

చుట్టుకందార్ధములు.

పరికించిదెలియజేసెద బరువడిమీరంగ వినుమిబాలకనీవుగ మరువకనుండిన మేలగు గురుమర్మము లెవరితోడ గూడదుబలుక నమ్మి నవారికి జెప్పుమునీవిక విరివిశిష్యవినరా విశదజీవతనులై బరగుపృథ్వి రేకు బాగతూర్పుననున్న సరసపుదళమందు బడగ నురుపుణ్య సంబా

ధపు పరమపనులను జేయవలెననుబలు కోరికగలుగునోయిసరసుడా కోరిక లడంగను విరివిగానుపఠింప్వాదారిన సరస రేచకపూరకుంభక సాధనము దినదినము జేయుము గూడదుబలుక॥ 175

గురుడావినునామనవిని కరమరుదుగ నచలహంస గానున్నట్టి స్థిరహంసయు కదలనిగా బరువడియాహంసయెట్లు బాగ చెలియించు దెలుపకబోవ సంశయముమించూ గురువరుడిట్లనియె కొమరుడవిను మోయి కరమరుదుదళముల కదలికానుబట్టి యరయగానాహంసయు ను మఱియు కదలినట్లుగనుపడు సురుచిరంబుగ హంసయెప్పుడు జూడ కదలకుండునోయి॥ 176

సలలిత సుగుణాదేశిక బలువాయుప్రరహితమైన, బాగగుచోటఁ గలదళములెట్లుగదలును దెలుపిమిగురురాయయనగ, దేశికుండనియే మంచిశిష్యుడనిమెచ్చుకొనియే పిలసితపుష్కర బలుపేదళములుగనుక నలపుష్కరముగడల నాదళముల్గదలును దేశికుండనియే మంచిశిష్యు డని మెచ్చికొనియె॥ 177

గురుడాదళములదిగువను కరమరుదుగ నప్పుజెలగు, కారణమే మిా పరికించియుదెల్పుడియన గురువరుడిట్లనియె శిష్య వరునివీక్షించి మంచివాడ వనిముదముమించి యెరుగుము దళములు నెండకుండునటుల సరిసగంగాయమునా సరస్వతులనె పరగగాతిగ కాలువలలో బాగభువ నముజెలగుచుండును తిరముగానాస్థానరహస్యము దెల్పువాడే దేశికుం డూ॥ వరునివీక్షించి॥ 178

గురుడా యామూడేరులలో బరగెడివనమెట్టిదగునో భావంబ లరఁ తిరముగదెల్పుడియనగా విరివిగగురుడిట్టులనియెవినుతశిష్యునితో నతిశయమగు పరమప్రేమతో కరమర్థ్యాశంబరను కర్మరూపముగాను బరగుచున్నవోయి గురులయనుభవమిది వరశిష్యునితో॥ 179

చుట్టుకందార్థములు.

గురుడాయానదిత్రితయము నరయగ నేతీరునుండు నాణెంబల

రన్ కరమర్థినేమి జేయను తిరముగ దెల్పుమియటన్న దేశికుండనియే
యెంతవాడ వనిమెప్పుగొనియే పంమపుత్రావినర గురురహాస్యంబిది
పరికించిబోధింతు బాగదాతుకొనుము పరగగానాగామిసంచిత ప్రాలు
బ్ధములనెడిత్రివిధ కరములేయసమనదులై కదలించునష్ఠదళముల॥ 180

గురువరయామూడేరులు కరమర్థనివాహరూపు గానున్నవిసరే
తిరముగమనవినివినుమా కరమరుదుగ వాహరూపుగానున్న విషము దళ
ములనేల కదలించు జెపుము పరమశిష్యా వినరా బాగుగనావిషము ఉరు
కర్మరూపముగ బరగుచుండుగాన ధరణినెవ్వరునేకర్మను తగ జేయవలశి
యున్నదో పరగనాకర్మకుతగిన పనిని జేయన్ దళముగదల్చును॥ 181

గురురాయుడయాగామియు పరగంగాసంచితంబు ప్రాలుబ్ధం
బున్ విరివిగమూడనియంటిరి తిరముగ నీసంబంధమ వియుదెల్పుమియ
నగా గురువరుడనియె సరసమలరంగా కరముగానాముాడుకర్మసంబం
ధంబో విరివిగదెల్పితి వినుమోయిపుత్రక దెల్పుమియనగా। 182

గురురాయుడ యాగామియునన పరికింపగ నెద్దియగునో బలు
కుమియనగన్, గురుశేఖరు డిట్లనియెను, సరసుడ వినుజీవుడవని
జన్మాదిగాగన్ జేసినపాపపుణ్యామిశ్రిములన్ ధరకర్మములకెల్ల వరుసనా
గామియని గురువరులు పేరిడిరి, కోరికరింజిల్ల జన్మాదిగాగన్ జేసిన
పుణ్యాపాపమిశ్రిములన్॥ 183

## చుట్టుకందార్థము.

గురుదేవుడశి సంచితమన పరికింపగ నేదియగునో, బల్కుమి
యనగా విరివిగ దేశికుడనియెను పరగగజీవుడనేక జన్మపరంపరనుంచీ
దా జేసిన యాగామినుంచీ విరివిగతాననుభ వించినకర్మబో నరయనిల్వ
వున్న, యాగామిరాశిక్, తిరముసంచితమనుచు బల్కిరిపరమ సాంఖ్యా
తెల్లపుత్రక గురుతుచే గనిపెట్టి దెలసిన గూడంతేయగు సుమిన్మా
పరంపరనుంచీ॥ 184

ప్రారబ్ధమనగ నేదియో ధరతచే దెల్పుమయ్యా దేసికవర్యా

కోరికలలరగ ననగా నేరుపురంజిల్లగురుం డిట్లనె శిష్యునితో వినరానిజ
ముువివరిన్తునీతో సరసపుంగివుంఢ సంచితరాసినుంచి మరియు దానుది
రిగి; ధరజన్మరాకకు పరగప్రారంభాదిగాను బలుపుగాను ఖర్చుపడి
యును కరముగానాఖర్చుపడిన కర్మవలననుకష్టసుఖమును పరగననుభ
వింపఁబడునది ప్రారబ్ధకర్మమనబడు వివరిన్తునీతో॥ 185

గురుఁడా దానొనరించిన గురుతరమాగామికర్మ గొప్పగు మేనఁ
బరువడి యచ్చట వర్తిలు పరికించియు దెల్పుమయ్యా, పండితవర్యా
యీసంశయము దీర్పుమాయయ్యా యరశిదెల్పెదవినర యాయాగామి
కర్మ పరగనాధారాది, పంచచక్రములందు విరివిగాను చేరియున్నది
వివరించిచూచుకొనుమి పరమసాంఖ్య గురులుయోగులు బాగుగాగని
పెట్టిరీమును॥ 186

గురువరయొక యాగామియె యరయంగా నై దుస్థలము, లందు
ననేలఁ బరువడిగ జేరవలయునె తిరముగవచియింపుడనగా దేశికుం
డనియే దెల్పెదనిక మరుగేలననియె బొరియఁజేప్పుడు పంచభూతసంబం
ధమా గురుతుగ నై పైన గుణములతో జేరి నరణిద్వ్యాపారముల జేయుచు
బరగుచుండును గానయాయా పరగుణసంబంధకర్మ పరగనాయావాట్ల
జేరును దేసికుండనియే॥ 187

జనకావినుమాకర్మయు ననయమునాధారప్రముఖమా చక్రి
ములఁ ఘనముగ నై దిటియందున పనిబడియుచు జేరుననుచు, బల్కి
యుంటిరే యివ్విధమ స్త్వబల్కుడుసరే మనవివినుమాయైదు ఘనచక్రిము
లును బనిబడియుట్లుండు బాగుగాదెల్పుమన వినియు దేశికుడిట్లనియెను
తనయయైదుచక్రిములు ఘనపాత్రిలరూపముగను కాయమందున
వెలగుచున్నవి బల్కియుంటిరే॥ 188

గురువరుడాయాపాత్రలు సరసతనేముఖముగాను స్వాంగమునుం
డుచ, గురుతరదెల్పుమియన పరమగురుండనియెశిష్యవరునిబొడగాంచీ
ఘనమునసంతసమునుమరిమించీ సంసుడవినవోయి పరికింపనాపాత్రల్

శరమధోముఖదృష్టిగా జెలగుచున్నవి వరునిబోడగాంచీ మనమునసంత
సముమరిమించీ॥ 189

## చుట్టుకందార్థములు.

గురువరుడా యీపాత్రలు సురుతరధోముఖదృష్టి యుండగబడ
వా పరికించిదెల్పుమీయన గురువరుడిట్లనియెశిష్య సరసుపాటగాం
చీ హారసన్నిభుం డితడనియోచించీ వరశిష్యావినుమోలు వరుసనో
క్కొకపాత్ర యరయతత్సంబంధమై దేశినాడులచే ధరణిపైనిబడకుండ
గవలుసగాబిగియుంచియున్నవి పరమయోగులంతర్నేత్ర వరముచేతను
గనిపెట్టిరి సరసుబాడగాంచీ॥ 190

వినుమాపాత్రలలోపల ఘనముగ నొక్కొక్కపాత్ర గన్నైదేశీ
ఘననాడీవరములచే వినుతగుణా క్రిందబడక వీలుండునటుల నెందుకుబిగి
యుంచియుండెటుల మనవిదెల్పుమియనగా మహాగురుడిట్లనియె వినుత
గుణాఢ్యాండ వివరింతునదియెల్ల వీలుండునటుల॥ 191

వరశిష్య వినుమిదెల్పెద సరసతజీవుండేభూత సంబంధంబౌ తిర
మగు మార్గముద్వారా బరువడియేకర్మజేసి ప్రబలుచునుండూనామా
ర్గసంబంధమా మొండూ వరుసన్నైదునాళ్ళద్వారా పథములవలవ తిరము
పాత్రలయందు వరుసగనాకర్మ విరివిప్రవేశించుటకును వీలుగాబిగియుం
చియున్నవి కరమరుమగనిపెట్టిరి పరమయోగీశ్వరులుమున్నా 192

గురుడా పాత్రలయందున బరువడిజేరియును కర్మప్రాకటముగనే
వరరూపముచేనుండును స్థిరముగబోధించుమయ్య దేశికవర్యా మము
రక్షింపకర్తప్రజయ్యా సరసశిష్యావినుమిచాలుగనాకర్మ నిరతముదేహ
మున నీటిసంబంధమా పరగనావిరిరూపముగ ప్రబలుచున్నది గనిపెట్టు
ము తిరముగానాయనుభవంబిది దేశికులకునెల్లనిష్ఠము॥ దేశికవర్యా॥ 193

జనకా గురువరవినుమా పసిబడియాకాశసంబంధంబైన పనిము
ట్లద్వారజీవుడు ననయుంబొనరించు కర్మంబాపాత్రలోకి నెవ్విధజేరుమన
మలరప్రాకీ జననుతజీవుండుసమానవాయువు వినుతంబగుశ్రోత్రంబు

వినుమిశబ్దమువాక్కు పనిబడిరైమెదింటితోడ భాగ జేయబడినకర్మ పని
వానికిపనిముట్లతో భాగవ్యవహారించుటకును నాపాత్రలోకి॥ 194

వరనాడులెమార్గముతో యరయంగానందువల్ల నప్పావిన రా
ధరపంచనాళ్ళద్వారా తిరముగనాకర్మదిగియు దివ్యవిశుద్ధ స్థానము
నందుదెలియుమిశ్రద్ధ పనిబడియున్నట్టి పాత్రిలోకి జేరు ననిమున్ను
యోగులుగనిపెట్టి బల్కిరి దివ్యవిశుద్ధ॥ 195

చుట్టుకంద్రార్థములు.

వినుమో దేశికముఖ్యా మొనసినాయు సంబంధపని, ముట్ల
ద్వారా యనయముజీవుడుజేసిన ఘనకర్మంబాపాత్రలోకి గనగానెటు
జేరు దెల్పిననాదు, సంశయముదీరు పనిబడివాయు సంబంధమహామన
స్సును చనువ్యానవాయువు చర్మముస్పర్శయు ననయముపాణియా
మైదింటితో జేరి ఘనుడు జీవుడుజేయు కర్మమైదింటికిని యనయము
మార్గంబులైన మైదునాడుల ద్వారదిగి యనాహతమందు జెలగెడి
యాపాత్రిలోకి జేరును గనగానెటుజేరూ॥ 196

గురురాయ శరణుజేసెద సరసతజెలగంగనగ్ని సంబంధముబల్
వరపనిముట్టులద్వారా యరయగజీవుండు జేసి, నట్టియాకర్మ యాపాత్రి
లోకి యెట్లుజేర్పుమా సరసుడవిను మగ్నిసంబంధమాబుద్ధి నిరతము
దానంబునరనేత్రిమురూపంబు చరణమీమైదింటితో జేరి జగతిజీవుడు
జేయుకర్మ పరగనీమైదిటికిమార్గ వరములై బరగేటిమైదు మరియు
నాడులద్వారా దిగియును మణిపూరకమందునున్న వరపాత్రిలోకి
జేరును గురురహస్యంబిదియు గనరా యాకర్మ॥ 197

మునినుతజలసంబధము పనిముట్టులద్వారగాను బలుజీవుండుల్
మనమలర జేయుకర్మయు ఘనముగనాపాత్రలోకి, కడువడియెట్లు జేరు
నోదెల్పు మనుభవమెట్లు తనయాజలసంబంధము తగచిత్తముప్రాణవా
యువు మానుగజింహ్వాయు మరిరసముగుహ్యాము బూనియామైదింటి

తోను, పోసగజీవుడు జేయుకర్మ మానుగానైదింటికిని, మార్గముౖలై జేలగుచుండూ కడువడియిట్లూ॥ 198

వరపంచనాళ్ళద్వారా పరసనుగాదిగియుతమ్మ స్వాధిష్ఠను నర్ బరగుచునుండెడిపాత్రిలో కరమరుగుగ జేరుచుండు, ఘనశిష్యా వినరా నమ్మినవాడ, వనిదెల్పితిరా బరగగనీరీతి బలుదేహమునమర్మ మరశియుబోధించు, మహానీయుడేగురుడు ఘనశిష్యా వినరా నమ్మిన వాడవని దెల్పితిరా॥ 199

జనకుడభూసంబంధము పనిముట్టులద్వారగాను బలుజీవుండుర్ పనిబడిచేసెడి కర్మయు వినుతగుణాపాత్రిలోకి, కేరీతిచేరు కృపచేతను దెల్పుమీతీరు వినుభూసంబంధమా ఘనమహంకారంబు ఘనుడయపా నంబు ఘ్రాణగంధగుదముల్ అనయమీనైదింటితోను నలరిజీవుడు జేయుకర్మ పనిబడినైదింటికినీ బాటలయ్యెజెలగుచున్నవి యేరీతిజేరూ కృపచేతను దెలుపుమీతీరు॥ 200

వినుమైదునాళ్లద్వారా యనయముదిగి విమార్గ మాధారము నర్ ఘనముగనుండెడిపాత్రలో వినుతగుణాజేరుచుండు విశదంబుగాను నిక్కమిదివిపినజాలును తనయాకొందరుగురువుల్ తగసాంఖ్యమేలనని తనయసములగు శిష్యులను జెరుపుచున్నారు ఘనతరంబుగ సాంఖ్యబో ధను కలనైనను విననివారికి మునినుతంబౌపరిపూర్ణ ముఖ్యబోధమెట్లు బ్బును విశదంబుగాను॥ 201

గురుడాసంచితకర్మము పరగన్నే స్థానమందు పొ్రిథతజెలగుర్ సరసతదెల్పుమియనగా గురువరుడిట్లనియెశిష్యవరునిబాడగాంచీ తగిన శిష్యు డితడనియోచించీ పరమశిష్యావినుమిబలుసంచితపుకర్మ సరసా ష్టాహ్వాయదేహా వరములకు దిగువను విరివిగూటిగవేణిసంగము విశద స్థానమున్నందు వున్నది సరసుడా గనిపెట్టువారలె సాంఖ్యగురువులన బడుదురు॥ 202

